హిందూవిజ్ఞానగ్రంథమాల

ప్రథమపుష్పము

# దాశరథీశతకము.

## ( భక్తియోగము )

ఆపదామపహర్తారం । దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం । భూయోభూయో నమామ్యహం.

గ్రంథకర్త :

వేములపార్వతీశము

మార్గదర్శి :

పట్టిసపు సూర్యనారాయణరావు జీ

# అవతారిక.

శ్రీవేదుల పార్వతీశముగారు సంస్కృతాంధ్రములందు ఘనపాండితిని సంపాదించిరి. సనాతన సాంప్రదాయము ననుసరించుచు, పూతజీవితమును గడపుచు, సాహితీసీమంతినికి వీరు పెక్కుకైసేతలను సమర్పించిరి. దాశరథీశతకము - భక్తియోగము, భగవద్గీతయోగశాస్త్రము, సంధ్యావందనము - విధానము, అనుభవసుఖజీవనము, నాఆత్మఘోష, సుమతీశతకము - ధర్మసూక్ష్మములు, పురాణములు - అంతరార్థములు మొదలగు గ్రంథముల రచించిరి. మేధాశక్తి సముద్భవమైన గ్రంథములు బహుళముగా వేలపథమున గోచరించుచుండును. ఇవి ఆదర్శ గ్రంథములు కాజాలవు. ఆత్మశక్తియందు నుదయించిన కృతులే దివ్యభావశబలతో వెలయును. పాఠకలోకమునకు దన్మయత్వమును గలిగించి సర్వతోముఖ మానవపురోభివృద్ధికి తోడుపడును గభీరసమాధిలో హృదయగర్భాలయమున తలలెత్తు తలంపులు ప్రధిపాప్రదీప్తములై, దివ్యాక్షములందు వ్యక్తములగును. "నానృషిః కురుతే కావ్యమ్" అను వాక్కు గంభీరభావభరితము కదా. ఋషిప్రోక్తసూత్రములను హృదయంగమ మొనరించుకొని, మనన నిధిధ్యాసములం దారితేరి గ్రంథించనకు గడంగుటచే శ్రీ పార్వతీశముగారి కృతులు దివ్యవిభూతిలో వెలయుచున్నవి.

మతము లన్నిటికిని ఆదిమతమైన ఆర్యమతముపై నిత్యసత్యసందీప్తమైన ఆర్షమతముపై నిత్యసౌందర్య సంశోభితమైన వైదిక మతముపై, బహుళ భాస్వరాంశయ ప్రదీప్తమైన వేదాంతమతముపై వారికి ప్రీతి మెండు. వేదాంతసారముతో వెలయుచు జ్ఞాన, సుజ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞానముల సంయుక్తితో విలసిల్లుచు, గ్రంథరూపమున వెలయు శ్రీకృష్ణుడై మెప్పుచు, ప్రపంచమత గ్రంథములో మిగుల నుత్కృష్టమనదగు ప్రశస్తి నందిన భగవద్గీతను శ్రీపార్వతీశముగారు విశేష

శ్రద్ధతో పఠించి సాధనతారకమును సర్వజనులకు విదితమొనరించిరి.

భగవద్గీత-యోగశాస్త్రము : ఉపనిషత్తుల సారము ; బ్రహ్మవిద్యకు సంబంధించిన సంవాదము. హృదయశక్తి మేధాశక్తులను మేళవించి. ఏకాగ్రదృష్టితో నాయుద్గ్రంథమును పరిశీలించి. అందలి భావపరంపర లను మనన మొనరించుకొనినపుడే ఉత్కృష్టజీవిత గ్రథనమున కది యుపకరించును పత్రికను పఠింపదొడంగెత్తు నిన్నటి పత్రిక నేడు తుక్కు ప్రోవునఁ జేరునది యేకదా: అనంత విషయములకెనయైన ధనములతో వెలయు మహాగ్రంథము వేలనియత్రలమును సదా తేజరిల్లుచునే యుండును. ఇట్టి యమృతసృష్టి హృదయ దిగ్వలయమును చేసికొనజాలు సామర్థ్యమును జగదీశుడు మనుష్యునకు ప్రసాదించెను. చింతనసాధనయందే యా సామర్థ్య ముదయించెను. ఇట్టి సాధనను సోద్యమ రీతిని గ్రంథకర్తగారు భగవద్గీతాంశములను విభజించి పాఠకుని మానసనేత్రము మ్రోలనిలిపిరి. ఈ యుదాత్త కర్తవ్యమును నిర్వహించు తరి తాము సలిపిన మనన నిదిధ్యాసల ఫలములను శ్రీ పార్వతీశముగారు పడసిరి. ఇట్టి ఫలములను ప్రజాళికి సమర్పించుటకై వారు కంకణము కట్టుకొనిరి.

సౌరభదానము ప్రసూనమొనరించును. కాని సమీర సాహాయ్యము లేకున్న సుమగంధము పూవుగుండెలోనే అడగి యుండును. ఆంధ్ర ధరిత్రిలోని సహృదయుల సద్భావసహకారములు ప్రస్తుత గ్రంథదేశా టనమున కనివార్యములై యున్నవి. గీత నిర్దేశించు ప్రపత్తియందు సదాశాకుసుమమును కుసుమింపజేయు దివ్యమరీచి కలదని విశ్వసింతు.

విజ్ఞానపిపాసువు

జొన్నగడ్డల సత్యనారాయణ,

Lecturer in English,

**S. R. R. & C. V. R College,**

VIZEAWADA.

## దాశరథీశతకము - భక్తియోగము.

# పండితుల ఆమోదన - ఆశీర్వాదనలు.



"దాశరథీశతకము - భక్తియోగము" గ్రంథకర్త వేమల పార్వతీశముగారు. నాకు చిరపరిచితులు. దీనిని వ్రాతప్రతిగా ఉన్నప్పుడే ఆమూలాగ్రముగా నేను చదివితిని. దాశరథీశతకము శతకములలోనెల్ల మిన్నయని నాదృఢవిశ్వాసము. ఇట్టి అభిప్రాయముతోడనే ఈయన వ్రాసిన ఈ వివరణమును ఆమూలాగ్రము చదివితిని. స్వానుభవముతో ఈయన వ్రాసిన వివరణ విశేషము రామభక్తులగు తెలుగువారికెంతయో మేలొనగూర్చునదయి యున్నదనుటకు సందేహములేదు.

ఈయన రామభక్తుడు. సనాతనధర్మావలంబి. సద్గుణసంపన్నుడు. పరుల క్షేమమునుగోరి ఈయన వ్రాసిన యీగ్రంథము త్వరలో నచ్చయి వెలువడునట్లు శ్రీరామచంద్రుడు కరుణించుగాక యని యాశీర్వదించు చున్నాను.

జనమంచి సీతారామస్వామి,<br>
ఆంధ్రభాషా ప్రధానోపాధ్యాయుడు<br>
M. H. School అనకాపల్లి.

బ్రహ్మశ్రీ వేమల పార్వతీశముగారికి— క్షీరసాగరము,<br>
బెజవాడ.

ఆర్యా. తమరు రచించిన "దాశరథీశతకము - భక్తియోగము" భగవద్గీతయోగశాస్త్రము" లోనైన ఆధ్యాత్మిక గ్రంథములు తమవలననే కొన్నిఘట్టములు విని మిక్కిలి సంతసించినాను. ఈకాలములో తమ

వలె నిట్లు పారమార్థికవిషయమందు వ్యాసంగమొనర్చినవారును, తమ అనుభవములను తోడివారికి తెలుపువారును మిక్కిలి అరుదుగా నుందురు. మీకు నుపాస్యదైవతము శ్రీరామచంద్రుడు సర్వదా మీయుద్దేశమును సఫలమొనర్చి మీకు ఆయురారోగ్యభాగ్యాదు లొసఁగి యింకను నిట్టి దాత్వికగ్రంథములను రచింపఁజేయఁగలఁడని విశ్వసించుచున్నాను.

చిత్తగించవలెను.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి,
శతావధాని,
16–1–48.

బ్రహ్మశ్రీ వేదుల పార్వతీశముగారు బహుగ్రంథములు రచించిరి. సుఖజీవనము, సంధ్యావందన విధి, దాశరథీ సుమతీశతకముల వివరణములు, భగవద్గీత - యోగశాస్త్రము ఇంకను అనేకగ్రంథములు వీరెంతో శ్రమపడి యెన్నో విషయములు సమకూర్చి తమ యనుభవమును జోడించి లోకోపకారముకొఱకు నింత శ్రమపడినారు. ఇవి అచ్చు వేయించు దాతలును, చదివి వీనివలన బాగుపడు సజ్జనులును కావలయును. వీరికి పరమేశ్వరుడు చిరాయురారోగ్యైశ్వర్యములను ధన ధాన్యాభివృద్ధియుఁ గలుగజేయుగాతయని యాశీర్వదించుచున్నాను.

విశ్వనాథ సత్యనారాయణ,
బెజవాడ,
13–1–48.

అనకాపల్లికి సమీపమున నున్న తరంగపూడి గ్రామకాపురస్తులు శ్రీ వేదుల పార్వతీశముగారు దర్శన మిచ్చిరి. వీరు చిన్నతనము మొదలుకొని పెద్దలను, గురువులను సేవించి విజ్ఞానమును సంపాదించి నారు. వీరు స్కూలు మేష్టరీ చేయుకాలములో దాశరథీశతకము బాలురకు పాఠము చెప్పుచో నందులోని భక్తియోగమంతయు సమగ్రముగా గ్రహించి ప్రతి పద్యమునకు నర్థరూపముగా నందలి భక్తిమహాత్వ తత్వమును వెల్లడించుచుఁ బెద్ద యుపోద్ఘాతముతో నొక చక్కని వేదాంతబోధక గ్రంథమును రచించినారు. అందు రాముని మహాత్వ మభివర్ణించుటయేగాక, రామాయణములోని పాత్రములు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు, సీత సుమిత్ర కైక కౌసలాదులు, తార మండోదరి ప్రభృతులు, రావణ వాలి సుగ్రీవ ఆంజనేయాదులు నెవ్వరో యెట్టియెట్టి తత్త్వమును బోధించువారో నిరూపించినారు.

ఈ భక్తియోగము, ఇందలి సంధ్యావందన విధానము, భగవద్గీత యోగశాస్త్రము, అచ్చువేయించి విక్రయించుట కీయన కిష్టములేదు. కావున భక్తులు ధనవంతులునగు నుదారులగు పుణ్యమూర్తులీయోగి వర్యునకు దోడ్పడి పైగ్రంథములు ముద్రింపించుటకుఁ దగిన సాయము నుు జేయవలయునని కోరుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి,
రాజమంద్రి.

శ్రీమద్గురు చరణారవిందాభ్యాంనమః
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# వి జ్ఞా ప న.

**పాఠకమహాశయులారా!** ప్రస్తుతము మనమనుభవించుచున్న దియు, ననుభవింపబోవునవియు, నన్నియును మన కర్మసూత్రముచే సంభవించునవియే గాని యీశ్వరానుగ్రహములు కావు. ఈశ్వరునకు మనమందరమును బిడ్డలమే. ఈశ్వరానుగ్రహము వలన గలుగునవి నిత్యానిత్యవివేకము, కర్మాకర్మవిచక్షణజ్ఞానము. ఈశ్వరుడు సర్వ శక్తుడు. ఆనందమయుడు. తన అజ్ఞానువర్తులయి తనలో చేరవలచిన భక్తులకు సహాయకారియయి పై జ్ఞానవిజ్ఞానముల నలవరచి తనలో జేర్చుకొనును.

హిందూవిజ్ఞానమనునది ప్రస్తుతమువలె రాత్రింబగళ్లు గ్రంథముల వల్లించుటవలన గాక మహనీయుల సేవచే వృద్ధియగును. తల్లిదండ్రులు తమపిల్లలు విద్యాభ్యాసమునకు దగు వయస్కులుకాగానే తగిన మహ నీయులవద్ద నొప్పగించుచుండిరి. వారు తమ గురువులవద్దనే నిత్యము నుండి గురువర్యుల యొద్దగల విద్యల కని, విని, యాచరించి యలవ రచుకొను చుండిరి. కావుననే భర్తృహరి "అమరుజెవిశాస్త్రమున" యని వచించియున్నాడు. ప్రస్తుతమట్లుగాక ముందుగా భాషాజ్ఞాన మలవరచు కొని దాని సహాయమున కొన్ని గ్రంథముల జదివి, తమ పాండిత్య మహిమచేతను, పూర్వజన్మవాసనచేతను లభించిన వాగ్ధోరణిచేతను నుప న్యాసములద్వారా జ్ఞానమును వెదజల్లుచు గీర్తిని గడించుచున్నారు. శ్రోతలును వానిని వినుటతో దమ కార్యము నెరవేరినట్లు భావించుకొని వినుచు గొంతకాలమైనకు దాము వారివలె మహోపన్యాసకులయి ధన్యులయినట్లు భావించుచున్నారు. కేవలము శాస్త్రజన్యజ్ఞానమేగాని

యనుభవజ్ఞానము లేని వీరి వాక్యములు గాలిలోని దూదిపింజెలగుచున్నవి. పూర్వులు అనగా మన విజ్ఞానమును వెదజల్లినవారు యోగమందు ఆరూఢులయినవారు. అట్టివారియందు భగవంతుడు లోకసంగ్రహమున కయి తన యంశను బ్రవేసింపజేసి వారిని నిమిత్తమాత్రులుగ జేసి జ్ఞాన విజ్ఞానముల వెదజల్లుచుండెను. కావుననే మన విజ్ఞానమునకు మూల పురుషులగు మహానుభావులు తాము లోకమునకై ప్రసాదించిన జ్ఞానమున పూర్ణత్వమే కనబడుచున్నది. ఇట్లొక్కొక్క మహావిషయమందలి పరిపూర్ణత్వమును మానుషవ్యక్తి తన సహజశక్తిచే వెల్లడించలేడు. వేయి గ్రంథముల జదివి విడచినవానికంటె నొక్క గ్రంథమును జదివి యందలి యొక్క విషయము నాచరణలో బెట్టినవాడెక్కుడు ఘనుడు. కావున జ్ఞానాభివృద్ధిని వొందగోరువారు కర్మాచరణులగు మహనీయుల సేవించి వారి యాచరణను అనుభవమును యట్లాచరించి అంశముల దెలిసికొనవలయును. ఆచరణలో నున్నవారే గ్రంథమును జదివి అందలి యాచరణీయాంశములు, నందుకు దగిన సాధనలు, నేవిగలవో వానివి విచారించి యాచరణలో బెట్టవలయును. అప్పుడందలి యంశముల విమర్శించి యందలి యదార్థమును దెలిసికొనగలరు. లోకైకగురుడగు శ్రీకృష్ణుడు సహితము మహామేధావంతుడగు నర్జునునకు గీతలను బోధించుటలో "ఇది నీకొఱకు చెప్పితిని. తగిన సాధనచతుష్టయ సంపత్తి లేనివానికి దీనిని బోధించరాదు. ఇది రహస్యము" అని పదే పదే పలుకుటకిదియే కారణము.

ఆకాశవాణివలె నిరాధారముగ, యోగరూఢులగుగార్గి, యాజ్ఞవల్క్య, వ్యాసాదులగు మహాఋషులనుండి పలుకబడినవియే శ్రుతులు, స్మృతులు. ఇట్టి వీరికి నిరాధారస్థలమునుండి వినబడినవియే వేదములు. ఇట్లు మహామేధావంతులును, ఈశ్వరాంశసంభూతులు, త్రికాలవేదులు నగు మహనీయులచే బలుకబడిన వాక్యములే వ్రాయబడినగ్రంథములే,

మన పూర్వులకు ప్రమాణగ్రంథములుగ నుండెడివి. కావున హిందూ విజ్ఞానము నుద్ధరించు దేశభక్తులు, యోగారూఢులును దైవభక్తులునయి నూతనాంశముల కర్థవివరణ నొనరించియు పూర్వవిజ్ఞానమును వెద జల్లుట ధర్మము. పండితుడు గృహస్తునివలె పూర్వగ్రంథము లందలి యధార్థమును లోకమున కెరుకపరచవలెను. కవులు యోగులవలె నూతన విషయములను, నూతనభావములను బయలుపరచవలెను. ఏ కాలమున యోగము నశించునో అప్పుడే హిందూవిజ్ఞానము క్షీణ దశలోనికి వచ్చినదగును. కావుననే శ్రీకృష్ణు డర్జునునకును, వసిష్ఠుడు శ్రీరామునకును యోగమును బోధించి దుష్టసంహారణము జేయించి ధర్మమును స్థాపించెను. నేను దాశరథీశతకములోని పద్యములకు తాత్ప ర్యమును వ్రాయుటలో హిందీలో భగవద్గీతలకు దాత్పర్యమును వ్రాయు టలో జ్ఞాదేవు పోయినపోకడ ననుసరింపదలచితిని. నేనమరకోశము నయిన జదువని వాడనగుటచేతనో సరియగు ధారణాశక్తి లేకపోవుట చేతనో గాని నాయభిప్రాయమునకు బూర్తియగు అంతరాయము కలిగి నది. ఒక్కొక్క పద్యమునం దా మహనీయుఁ డిమిడ్చిన పదరత్న ములనేరీతిని మార్చిన యా శోభకలుగును? అట్లైన భక్తుల నానంద వార్ధిని ముంచుటయెట్లు? ఇది పొసగనిది. కావున నందామహనీయు డిమిడ్చినట్లే యుండవలయునను భావము నాకు గలిగినది. "జుఱ్ఱెదమీ కదామృతము......ఒభండనభీముడా ర్తజన బాంధవుడు" మొదలగున వెన్నో పద్యములందలి యవస్థను సరిపుచ్చుట కేపలుకులు వచనమున పలుకుటకు సాహసించును? కావున, నేను సమకట్టిన కార్యమును విర మించితిని. కాని యా మహనీయు డితరశతకములవలె గాక తన శత కమునందు భక్తియోగమునకు సాధనయు భక్తుని యవస్థలను క్రమాను గతముగా నిమిడ్చి యుండుటచేతను, నట్టి విషయములను సాధకులు తెలిసికొనవలసి యుండుటచేతను, పద్యములు ధారాళముగా పైకి చదువ

వలసినవిగాని మానసికముగా ధ్యానించవలసినవికావు గనుకను. భక్తుడు భగవంతు నొకానొకప్పుడు మానసికముగ ధ్యానించవలసిన యవసరము కలిగి యుండుటచేతను. నాకు మార్గదర్శులు మహనీయులు నగు శ్రీ పట్టిసపు సూర్యనారాయణరావుజీగారి బోధనాప్రభావము వలనను. శ్రీరాముని కృపామహిమ వలనను కించిజ్ఞుడనగు నేను ఇందలి పద్యములకు భావవివరణములను వ్రాయసాహసించితిని. కావున ప్రాజ్ఞులు నా లోపముల సవరించి యనుగ్రహింప ప్రార్థించెదను. నే నమరకోశము నయిన జూడనివాడనగుటచేతను, ఇది సాహిత్యగ్రంధము గాకపోవుటచే పాఠకులు లిందలి విషయములనే గ్రహించి వ్యాకరణాది దోషముల మన్నించ ప్రార్థన.

నే నీగ్రంథమున కిట్లు విమర్శనను వ్రాయబూనుటకు గలకారణము నాయుపాధ్యాయవృత్తిలో బడిలోని బాలురకు దాశరధిశతకము లోని పద్యముల నేర్పునప్పు డందు భక్తియోగమునకు సాధన, క్రమాను గతముగా నుండినట్లు గోచరించుటచే నంత దానిని విమర్శనతో జదివి యందలి భావమును క్లుప్తముగా నొకచో వ్రాసితిని. ఇట్లుండ నొకనాడు మాగ్రామస్థులును భక్తులు నగు నల్వురు స్త్రీపురుషులు గలసి పారమార్థికగోష్ఠి రాత్రి 10 గంటల వరకును నడిపిరి. పిమ్మట వచ్చి పండు కొంటిని. ఆరాత్రి 2, 3 గంటల సమయమున నాయిద్దరు భక్తురాండ్రును మాగృహమునకు వచ్చి చీడీపై కూర్చుండి యున్నట్లును. నేను గదిలో భగవంతుని ధ్యానము చేయుచు సుమారు నాలుగు గంటల సమయమున బయటకు వచ్చుసరికి నాయిద్దరు భక్తురాండ్రును మెల్లగా దమగృహము లకు జనుచున్నట్లును గాంచితిని. వెంటనే దాశరధి శతకము స్ఫురణకు వచ్చినది. దాని మార్గమును నట్టివారలకు దెలుపుట నావిధియని భావించి శ్రీరాముని యాజ్ఞగా నీవిమర్శనను వ్రాయ సాహసించితిని. నేను బీదవాడ నగుటచే ప్రజల సహాయముతో దీని నచ్చొత్తించి భక్తుల కుచితముగా సమర్పించదలచితిని. కావున మహనీయులు నాకు సహాయులయి నాసంకల్పమును నెరవేర్ప ప్రార్థన.

# పీఠిక.

హిందూమతమున ప్రతి జీవనిర్జీవపదార్థమును ఈశ్వరాంశలోనిదే యనియు నాకారణమున బ్రతిపదార్థము నెప్పుడో యొకప్పు డెన్నిపరిణామముల బొందినను అంత్యమున నీశ్వరునిలో జేరవలసినదియే యనియును సిద్ధాంతము. అట్టి స్థితిలో మనుజుఁ డుత్కృష్టుడు. ఈశ్వరుని గర్భగృహద్వారమున బ్రవేశించుటకు దగిన శారీరక, మానసిక నిర్మాణము గలవాఁడు. బాహ్యరూపమున, భేదమంతగా లేకున్నను మానసిక రూపమున గతకర్మవాసనలచే ననేక సంబంధములు గలవాడు. వాసనాత్రయములతో గూడినవాడు. ఇట్టివా డీశ్వరునిలో జేరవలయుననిన ఈ వాసనలను నశింపజేసికొనవలెను. ఇట్లు వీనిని గ్రమముగా నశింపజేసికొనుటకే మన మతమున వర్ణములు, నాశ్రమములును, వానికి దగిన ధర్మములును, వృత్తులు నేర్పాటు చేయబడినవి. ఇట్టి వర్ణాశ్రమధర్మముల నెరుక పరచునవియే వేదములును, శాస్త్రములును, పురాణములు నితిహాసములు మొదలైనవి.

అదివరలో వస్తురూపముగా చేయబడి చెడిన బంగారము పుటముచే పరిశుద్ధతను బొందినట్లు పై వేద విహితకర్మలచే మనుజుడు చాల వరకు పరిశుద్ధుడయి, ఉత్కృష్టస్థితిలోనికి జేర్చు సాధన కర్హుడగును. అంతట వీడు చేపట్టవలసినది యోగము. ఇది మూడు అవస్థలను గలిగి యుండును. అవి కర్మ, భక్తి, జ్ఞానములు. ఇవి మూడును ప్రత్యేకమార్గములని కొందరి యభిప్రాయము. కాని అట్లుకాదు. ఈ మూడును ఒకదానితో నొకటి కలసి యుండవలసినవేగాని విడిగా నుండవలసినవి కావు. ఎవడు అధిభౌతికతత్వ మెక్కువగా గలిగి యుండునో వాడు చేపట్టవలసినది యోగమందలి కర్మ. ఎవడు అధిదైవత తత్వము నెక్కువగా గలిగియుండునో వాడు చేపట్టవలసినది యోగమందలి భక్తి.

ఎవడు ఆదిభౌతిక యధిదైవత తత్వములనుండి విడివడునో వాడు చేపట్ట వలసినది యోగమందలి జ్ఞానము. ఇందు ముగ్గురియందును మూడు తత్వములను గలిసియే యుండును. కాని యాయాస్థితిగలవారియం దాయాతత్వములు విజృంభించి స్థిరపడి పై తత్వముల నాశ్రయించ నర్హులగుదురు. ఇందు దాశరధిశతక కర్త భక్తియోగులలో నారూఢ స్థితిని బొందినవాడు. వీని కాధారము భగవంతుడు. భగవంతునియెడల భక్తుని ఆలాపనయే దాశరధిశతకము. ఈయన భక్తుడు ఆరూఢస్థితికి వచ్చువరకును బొందు నవస్థల నిందు క్రమానుగతముగ వివరించి యున్నాడు. బంగారము వస్తురూపముగ తయారగుటకు బంగారమెట్లు శుద్ధమయినది కావలసియున్నదో యట్లే మానవుడు యోగము నభ్యసించి కృతార్థుడగుటకును శారీరమానసికముల శుద్ధుడయి యుండవలెను. కావుననే ఈయన తన గ్రంథాంతమున నీతి నియమముల ప్రాముఖ్య మును దెలిపెను. కావున సాధకులు నాచే వ్రాయబడిన సుఖజీవనమును, ఆత్మశోధయనుదానిని జూచి యనుసరింపవేడెద.

## ఆరూఢ భక్తుడు.

ఆరూఢయోగియు నారూఢభక్తుడును స్వల్పభేదములో నుందురు. ఆరూఢయోగికి దానను శబ్దము సహితము నశించును. ఆరూఢభక్తునకు దానను శబ్దము తక్క తక్కిన ద్వంద్వములన్నియును నశించును. కామధేనువుగల వానికి కరవుబాధ కలుగదనునట్లు సర్వశక్తుడగు భగ వంతునియందు దృఢభక్తి గలవానికి ఎట్టిభయములును లేక కష్టసుఖ ములు శీతోష్ణములు మొదలగు ద్వంద్వములు సహితముండవు.

## ముక్తి.

ద్వైత మున్నంతవరకును ముక్తిలేదు. ద్వైతము లేక యద్వై తము తెలియబడదు. ఆరూఢభక్తు డద్వైతమునకు చివర గర్భగృహ

ద్వారమున నుండును. అక్కడ ఉల్లిపొరవలె జక్కని తెర గలిగి పైన నద్వైతముండును. భక్తు డాస్థానమునకు జేరగనే భగవంతు డాతెరను విదలించి జ్ఞానోపదేశమునుజేసి భక్తుని ముక్తునిగా జేయును.

## రా మ త త్వ ము

రామతత్వ కృష్ణతత్వ శివతత్వములు మూడును వేర్వేరు అవస్థలను. అధిక్యతలను గలిగియుండిన ప్రత్యేక వ్యక్తులనియును. అందు తాము దేనినవలంబించిన యుత్కృష్టులమగుదు మనియును చాలమంది తొట్రుపడుచుందురు. ఈ మూడును వేర్వేరు వస్తువులుగావు. ఒకేవస్తువునందు వేర్వేరు భాగములు. ఇందు భక్తు దేభాగమును జేపట్టినను అన్ని భాగములును వానిచేతనుండును కాని సాధకుడే భాగము జేపట్టిన యితరభాగములు చలింపకుండునో తెలిసికొనవలెను. ప్రధానమగు తత్వములు విష్ణుతత్వము శివతత్వములు రెండే. ఇందు విష్ణుతత్వము సాకార పరబ్రహ్మమును, శివతత్వము నిరాకార పరబ్రహ్మమును దెలుపును. ఇట్టి సాకారనిరాకారతత్వముల రెండింటిని కలుపునదియే రామతత్వము. కావుననే ఇది సర్వజనులచే నాదరణీయము నాచరణీయమును నయి యున్నది. యిందు గృహస్థ. వానప్రస్త. సన్యాసములు మూడును గలవు. అది భౌతిక. అది దైవత. ఆధ్యాత్మికములు మూడును గలవు. ఒక యుద్యోగము అరంభమున 100 రూపాయలను మధ్యమమున నూట ఏబదిరూపాయలను అంత్యమున రెండు వందల రూపాయలను జీతము కలది. నిరుద్యోగులకు దరఖాస్తుదారులు ప్రయత్నించవలసినది ఇందు మొదటిస్థానమే క్రిందిస్థానములలో పనిచేసినవారు ప్రయత్నించవలసినది పైస్థానములు. అరంభకులకు క్రింది స్థానము లభించినను కొంతకాలమునకు పైస్థానముకూడ లభించకలదుకదా. అందుచే దరఖాస్తుదారు ఏ స్థానమును జేపట్టినను అన్నిస్థానములను జేపట్టినట్లేకదా ? కావుననే త్యాగరాయులు శ్రీరాముని ప్రార్థించుటలో "శివుడవో, మాధవుడవో,

ఎవరవి నిర్ణయించేదిరా" యని పేర్కొనెను. కావున సాధకులు సంశయముల వీడి నూటికి 99 గురు ఆరంభకులే యనునది మరువక రామ తత్వముననే కృష్ణశివతత్వములు గూడ పూర్ణములై యున్నవని రామ భక్తులయి తరింపకోరెదను.

## తారకసిద్ధి.

సిద్ధులలో ఒకటి తారకసిద్ధి, రెండు సాంఖ్యసిద్ధి, మూడు అమనస్క సిద్ధి. ఇందు తారకములో ఒకటి రామతారకము, రెండు శివ తారకము. సర్వేసర్వత్ర లోకములో తారకమనగా రామతారకమే యని వాడబడుచున్నది. తారకమన దశవిధ నాదములకు పైగా నుండు ఓంకారము. ఇదియే హిందూమతముననగల సమస్తదేవతలకును స్మృతులు, శ్రుతులు, వేదములకును సమస్త హిందూవిజ్ఞానకళలకును మూలాధారము. ఇందు విజృంభించిన మహాశక్తులే సృష్టిస్థితిలయములకు మూలములు. ఇందలి పటమందు నేను కనుపరచిన ఓంకారము రామ, కృష్ణ, శివతత్వముల మూడింటిని కరపరచుచున్నది. అదిగాక అకార, ఉకార, మకారములు విభజింపబడి అందు తిరుగా అకార, ఉకార, మకారములు విభజింపబడినవి. ఇట్లు విభజింపబడిన ఓంకారము తొమ్మిది భాగములుగా గనబడుచున్నది. ఇందులకు కారణము ప్రతి తత్వమును దాని యాధిక్యతచే నాయానామముల ధరించినను మూడు తత్వములును లీనమయ్యే యున్నవి. అఖండతేజోరూపుడగు మూలపురుషుని సగుణరూపమున వెదురుబోదును దొప్ప లావరించి యుండునట్లు అకార, ఉకార, మకారములు అను దొప్పలంటియే పైకి పోవలయును. అప్పుడు 'మ్' అను మూడవయంతరమున నగ్రస్థానముచే కూరును.

## గాయత్రీమంత్రము.

హిందూవిజ్ఞానమంతయును యోగముచే గ్రహించబడి మంత్రములచే నాకర్షింపబడి యంత్రములచే స్థాపింపబడి యున్నది. గోపన్నగారు

తాను రచించిన దాశరథిశతకమందలి పద్యములకు మకుటముగా భద్రగిరి, దాశరథీ కరుణాపయోనిధీ యను గాయత్రిలోని భర్గోదేవస్య. ధీమహి. ధియోయోనః ప్రచోదయాత్ అను దానిలోని భ, ధీ. ధి. యను ఆధిభౌతిక. అధిదైవత. ఆధ్యాత్మిక శక్తులగు మూడు బీజములను చేర్చెను.

గాయత్రి :—మంత్రముల కన్నిటికిని తల్లివంటిది. మంత్రములకు యంత్రములకే గాక సృష్టికంతకు నాధారమైనది. దీనిని విడచిన ప్రతి మంత్రమును నిరాధారమైనదియే.

మూలపురుషుడు.

1. రాముడు (రామతత్వము) బాహ్యప్రకృతిని స్వాధీనపరచి మూలప్రకృతిచే భక్తుల శివతత్వములో జేర్చువాడు. బాహ్యప్రకృతివైపు ముఖము గలవాడు. మాయామానుషము. తనను తానొక్కొకప్పుడు మరచుచుండెను. ఆకారణముననే నారదాదు లప్పుడప్పుడు స్ఫురణకు దెచ్చుచుండిరి. (1) కోదండరామ. (2) పట్టాభిరామ. (3) సీతారామ. ఓంకారమందలి అకార. ఉకార. మకారములు.

2. కృష్ణుడు (కృష్ణతత్వము) సాధీనమయిన బాహ్యప్రకృతిగల మూలప్రకృతిచే శివతత్వమున జేర్చువాడు. లీలామానుషము. తెలిసియు దెలియనట్లు నటించుచుండెను. (1) కాళీయమర్దన. (2) వేణుగోపాల. (3) రాధాకృష్ణ. ఓంకారములోని ఉకారములోని అకార. ఉకార. మకారములు గలది.

3. శివతత్వము. మూల ప్రకృతిని దనలో నైక్యమొనర్చుకొనునది. ఓంకారములోని మకారమందలి అకార. ఉకార. మకారములు గలది. (1) తాండవశివ. (2) పార్వతీపరమేశ్వర. (3) అర్థనారీశ్వర.

## మానసపూజ

కొంతకాలమువరకును శ్రీరాముని పటమును ముందుంచుకొని ధూపదీపనైవేద్యముల సమర్పించి దాశరధీశతకమందలి పద్యముల తోడను మహాభక్తులుకూర్చిన కీర్తనలతోడను ప్రార్థింపవలెను. అట్లు ప్రార్థించుటలో నందలి పరిస్థితులను తనయందెప్పటికప్పుడు ఆరోప ణను జేసికొనవలెను. తన తప్పులను మన్నించునట్లును, ఎట్టి తప్పులను చేయకుండ నుండునట్లును, నిశ్చలచిత్తముతో ధ్యానించుటకు ప్రకృతి బాధలు లేకుండునట్లును, వరమొసంగునట్లు రాముని ప్రార్థించవలెను. రాముని గుణశీలంబుల వర్ణించుచు నానందించవలెను. రాముడు పరిపూర్ణ డను భావముతో నుండవలెను. ఇట్లు కొంతకాలమయిన పిమ్మట భజనను తగ్గించి పటమున సూచించినరీతిని భగవంతుని బాహ్యమున, పటమందు చూచుచు, దన దీనత్వమును నశింపజేసి రక్షించునట్లు ధ్యానించవల యును. ఆ విగ్రహమందలి అవయవ రూపమగు (కోదండరామునందలి) తేజస్సును, ముఖకమలమందలి చిరునగవును మనస్సుననిలిపి యానం దింపవలయును. ఇట్టిస్థితిలో భగవంతుని బాహ్యముగ ప్రార్థించుట గూడ జరుగును. ఇట్లు కొంతకాలమయిన పిమ్మట శ్రీరాముని పటమునుంచి ధూపదీపనైవేద్యముల సమర్పించి శ్రీరాముని బాహ్యదృష్టిచే వీక్షించి యవయవరూపమగు తేజస్సును ముఖకమలమందలి ప్రసన్నతను చింతించి యానందించవలెను. ఇట్లు చూచుచునే యాదివ్యమంగళ విగ్ర హమును తన హృదయమున నిలుపుకొని కన్నుల మూయవలెను. పిమ్మట తన దృష్టిని పాదములవైపునకు ద్రిప్పవలెను. అచ్చట కొంత కాలముంచి క్రమక్రమముగా పాదములు, జానువులు, కటి, నాభి, హృద యము, కంఠము, శిఖవరకు దృష్టి నుంచవలెను. ఇచ్చట కంఠమందు దృష్టినుంచి పై ముఖమును కిరీటమును పూజింపవలెను. ఆరంభమున పాదములయందు చాల కాలమువరకును దృష్టినుంచవలెను. ఆ రీతినే

క్రమముగా నొక్కొక్కదానియందే దృష్టి నెక్కువకాలముంచుచు పూజించవలెను. ఇట్లు కొంతకాలమయిన పిమ్మట ఏకాంతమున చీకటి యందు కన్నులమూసి శ్రీరాముని పరిపూర్ణ విగ్రహమును తన హృదయ స్థానమున స్థాపించుకొని పద్మాసనాసీనునిగా పాదములు. కటి. నాభి. హృదయముల పూజింపవలెను. ఈ నాలుగు పరిస్థితులయందును భక్తుడు భగవంతుని ఏకాకియై ధ్యానించవలెను. ఇందు చెప్పబడిన పరిస్థితులు ఒకదానిపిమ్మట నొకటి భక్తునకు తనంతనే కలుగును. అట్లు కలిగిన దానిని కొంతకాలము స్థిరపరచుకొనిన గాని రెండవపరిస్థితిని చేపట్ట రాదు. అన్ని పరిస్థితులయందును ఆఖరున కర్పూరమును వెలిగించి దానియందు దృష్టినుంచి యొక్కసారి కన్నులమూసి యా తేజస్సును హృదయమున నిలిపి పిమ్మట కన్నుల తెరువవలెను. భక్తునకు దయా సత్యశౌచములతో గూడిన శీలము ముఖ్యము. అట్టి శీలమును సరిచేసికొను టకు నాచే వ్రాయబడిన సుఖజీవనమును చదివి 'నా ఆత్మశోధ'ననుసరించ వలెను. ఇందు ఒకటి రెండు పరిస్థితులకు రాత్రి 7-10 గంటల మధ్యకాల మును 3,4 పరిస్థితులకు రాత్రి 1-4 గంటల మధ్యకాలమును శ్రేష్ఠము.

## ఉ ప దే శ ము

ప్రస్తుతము హిందూదేశములో నూటికి 99 గురకు ఆచరణలో లేకున్నను ఇహపరములు రెండును కలవనియును, మనుజుడు పర మునే కోరవలయుననియును, అను భావమును గలిగియే యున్నారు. ఇందు చాలమంది అందులకు తగిన మార్గమునకయి తికమకల పడుచు ఎవరేది చెప్పిన నట్లు నడచుకొనుచు యదార్థమును గానక నేమిచేయుట కును అవకాశములేక అంతటితోనే సంతుష్టిని పొందుచు కాలమును గడపుచున్నారు. మరికొందరు గురువుల దుర్బోధనలచే ఉభయభ్రష్టత్వ మును పొందుచున్నారు. పురుషులు కర్మకాండలను ఆచారాది నియమము

లను విడచుచున్నారు. స్త్రీలు భర్తృసేవను, బిడ్డలపోషణను, అతిధి అభ్యాగతుల యాదరణను విడచున్నారు. ఇట్టిలోకమును గాంచి కొందరు పూర్వపుణ్యఫలముచే తమకు లభించిన వాక్చాతుర్యముచే నిట్టివారిని లోబరచుకొని వారి ప్రాణమాన ధనములకు కూడ హానిని కలిగించుచున్నారు. కావున అట్టి పరమును కోరువారు గోపన్నగారి దాశరధీశతకమే తనకు సాధన యనియును, దాశరధియే తనకు గురుడు, దైవమనియును తలంచి అందామహనీయుడు విరూపించిన అవస్థల చింతించుచు ధ్యానించవలెను. అట్టివారికి భగవంతుదేదియో రూపమున పత్యక్షమయి జ్ఞానోపదేశమును చేయవలెను. సాధనాసక్తులు తమకెవరయిన నొకరు తారసించి వారు మహనీయులనితోచి వారి యుపదేశప్రకారము నడచుకొనవలయునను ఊహజనించిన నా మహనీయుని క్రిందియంశముల సవినీయముగా నడుగవలయును. "మహాత్మా! యోగమనగా నేమి? చిత్తమనగానే? దాని వృత్తులేవి? అవి ఏయేస్థానముల నున్నవి? వానివి నిరోధించుట యెట్లు? ఇప్పుడు నా చిత్తము ఏయేవృత్తులతో కూడియున్నది? అవి ఎంతలో నశించగలవు? పరోక్షమున మీ యుపదేశమెట్లు పొందగలము. ఇప్పుడు నాకున్న వాసనలు అరంభస్థితిలో నున్నవా? మధ్యస్థితిలో నున్నవా? అంత్యదశలో నున్నవా? సెలవిండు." ఈ యంశముల గ్రహించి ఉపదేశించువాడే మార్గదర్శి. అంతవరకును రాముదే గురుడు, దైవము అని నమ్మి ధ్యానించవలెను. ప్రతివానికివి నిజమగు గురుడు పరమేశ్వరుడే. ఇతరులు నిమిత్తమాత్రులు. శిష్యుడెట్లు తగిన గురువికై పరితపించుచుండునో గురుడు నట్లే తగిన శిష్యునికై నిరీక్షించుచుండును. దయాసత్య శౌచముల గలిగి అతిధి అభ్యాగతులను, కుటుంబమును ఆదరించుచు తగురీతిని వృద్ధిలోనికి తెచ్చుటయే యీశ్వర సేవయని ఆనందించువారికి అందరానిదేమున్నది.

# సమష్టి భజన.

మనమొక గృహమును కట్టిన అగృహమం దొక శక్తి ఆవరించి యుండును. ఇట్టి ఈ శక్తులు. మంచివి చెడ్డవి అను రెండు విధములు గలవి. మంచిశక్తి ఉచ్చత్వమును. చెడుశక్తి నీచత్వమును కలిగించును. కావున గృహమును నిర్మించునపుడు శంఖుస్థాపనను జేసి తనకులదేవతను ముందుగా ప్రవేశపెట్టవలెను. అట్లనే గ్రామమును నిర్మించునపుడును శంఖుస్థాపనను జేసి పొలిమేరలగట్టి రామరాజ్యమువలె గ్రామము ధర్మమును తప్పక సకల సంపదలతో తులతూగునట్లు ముందుగా రామాలయమునుకట్టి రాముని స్థాపించవలెను. ఆసేతుహిమాచల పర్యంతమును రామాలయములేని గ్రామములేదు. ఈ ఆలయము నాలుగు వీధుల ప్రజలకును అందుబాటులో నుండునట్లుండవలెను. పూర్వము మనవారు అతివృష్టి అనావృష్టి దోషములు కలుగునప్పుడును. పశురోగములు. సస్యరోగములు. కలరా. మశూచి మొదలగు అంటుజాడ్యములు సంభవించునప్పుడును. వాటి నివారణకయి రాముడే కాపాడువాడని రామభజనను చేయుచుండెడివారు. రాముని సన్నిధిని అసత్యము రాదనియును ధర్మాధర్మముల విచారించి ధర్మమును నిలుపువాడు రాముడే అనియును రాముని సన్నిధినే తమ తగవుల తీర్చుకొనుచుండిరి.

రాముడు తేజోరూపమున అంతటను నిండియున్నాడు. ఆతేజస్సుతో దుష్టశక్తులను తెలియకచేసిన పాపములను నశింపచేయుచున్నాడు. కావున తేజోరూపమగు దీపమును రాముని రూపముగా నుంచి యాతేజస్సును అందరును ఆకర్షింప వీలగునట్లు దీపమునకు చుట్టును గుండ్రముగా నిలువబడి భజనను చేయవలెను. ఇట్లు గుండ్రముగా నిలువబడి భజనను చేయుటచే మధ్యగల వాయుచలనము గుండ్రముగా తిరుగునదయి దోషరహితయయి ఆయువును. బలమును వృద్ధిచేయుచున్నది. తాళములను హృదయమునకు తిన్నగా నుంచి వాయించవలెను.

"శ్రీమన్నారాయణ, గోవిందో, హరి" అనునప్పుడు చేతులు శిరస్సుపైకి యుంచి జోడించి యొక్కసారి క్రిందకు దించి వెంటనే హృదయమున చేర్పవలెను. పాటలలోని పద్యములలోని పరిస్థితులను తమయందు ఆరోపించుకొనవలెను. ఆఖరున మంగళమును కుడిఎడమలకు శాంతముగా తిరుగుచు పాడవలెను. ప్రసాదమును తీసికొనకపోరాదు. ప్రసాదమును ఎంతస్వల్పముగా తీసికొనిన అంత ఫలిత మెక్కువగును.

## భ క్తు ని భా వ ము

తనకేదైన మేలు చేకూరిన నది యీశ్వరుని కృపయనియును, కీడు సంభవించిన నది పూర్వజన్మమున తనచే చేయబడిన కర్మఫలితమనియును, దానిని అనుభవించుట ఋణవిముక్తి అగుటయని యనియును, ఎంత శీఘ్రముగ ఋణవిముక్తుడైన నంతశీఘ్రముగ నీశ్వరుని చేరవచ్చుననియును, అందులకయే యీశ్వరుడు తనయందలి కృపచే వాటిని వేగముగా అనుభవములోనికి తెచ్చుచున్నాడనియును భక్తుడు సంతసించవలెను. కల్పవృక్షము పెరటగలవాడు కరవుబాధకు భయపడునా ? సర్వశక్తులును ఈశ్వరునియందు ఉన్నవనితెలిసి, వానిని చేపట్టి, యిహ సంబంధమగు బాధలకు దిగులుపడుట పాడియా ? అట్టివాడు దృఢమగు భక్తిగలవాడగునా ? అట్లునమ్మి యిట్లు భయమును పొందుట భగవంతునియందు సరియగు నమ్మకము లేకుండుటయేకదా ?

## గ్ర ం థ క ర్త

ఈయన పరమభక్తుడు. అయినను ఈయనను పూర్వజన్మవాసనా లేశములగు కామాదులును, ఈషణత్రయమును, అప్పుడప్పుడు బాధించుచుండెను. ఈయన ప్రాతఃకాలముననో, మధ్యాహ్నముననో, నిశాసమయముననో యీశ్వరుని భజించుచు తనకుగల లోపముల నీశ్వరునకు ఎఱుకపరచుచుండెను. భక్తుడయి భక్తిపరవశతతో తాండవమాడువానికి

అవస్థలు ఒకే మాదిరివి ఎల్లప్పుడును ఉండక వివిధరీతుల మారు చుండును. ఒక్కొక్కప్పుడు పరమదీనుడగును. ఒక్కొక్కప్పుడు పరిపూర్ణుడగును. ఒక్కొక్కప్పుడు భగవంతుని భక్తుడగును. ఒక్కొక్కప్పుడు భగవంతుడేయగును. ఒక్కొక్కప్పుడు భగవంతుని దూరును. ఒక్కొక్కప్పుడు పొగడును. ఒక్కొక్కప్పుడు తన్ను నిందించుకొనును. ఒక్కొక్కప్పు భూషించుకొనును. ఇట్లనేక విధములుగ మారుచుండును. ఇట్లు మారుటకు కారణము అనుభవమే. కావున గృహస్థాశ్రమమునుండి తరింపగోరువారికి గోపన్నగారు వారి దాశరథీ శతకముద్వారా మార్గదర్శి. ఈ శతకమును ఈయన ఆరూఢస్థితిలోనికి వచ్చినపిమ్మట ఈశ్వరుడు లోకోపకారము నిమిత్తము ఈయునయందు ప్రవేశించి రచింపజేసి యుండును. ఈయన నదీతీరమునకు బోయి ఒక్కొక్క పద్యమునే తాటాకుపై వ్రాయుచు దానిని నదిలో పడవేయు చుండగా ప్రవాహవేగమున కొట్టుకొని పోవక ఏయేపద్యములు తన వైపునకు వచ్చుచుండెనో ఆయా పద్యముల నన్నిటిని దీసి యొక శతక ముగా గూర్చెనని పెద్దలు చెప్పుట కలదు. ఇదంతయు రాముని కృప గాకున్న భక్తుడు ఆరూఢస్థితిలోనికి వచ్చువరకును పొందు అవస్థలను ఇట్లు క్రమానుగతముగా వ్రాయబడుట వీలగు పనికాదు. శ్రీకృష్ణపర మాత్మ తన గీతావాక్యములందు అర్జునునకు, "సమంకా....స్పర్శాన్‌కృ ....సర్వద్వారా...." అను మూడు శ్లోకముచే బోధించి మూడు అంతరు వుల లక్ష్యమును, యోగిపుంగవుడగు పోతన్నగారు "వారిజలోచను.... కవిలోచన....తరుణుల్‌గొం...." అను మూడు పద్యములచే గోపికల సాధనాలక్ష్యముల మూడు అంతరువులను యీ ఆరూఢభక్తాగ్రేసరుడు తన దాశరథీశతకమున "సిరు....పెంపనుదల్లి....దైవము త...." యను మూడు లక్ష్యములచే మూడు అంతరువులను చూపెను. అష్టపదులను. కృష్ణతరంగములు, అధ్యాత్మ రామాయణ కీర్తనలు వ్రాసిన మహాను

భావులయొక్కయు, త్యాగరాజు, పోతన్నగారల యొక్కయు తెగలో జేరినాడీమహాత్ముడు గోపన్నగారు.

## ఇష్టదైవము

ఈయన యీ శతకమును వ్రాయకపూర్వము భద్రాచలమునకు బోయి అందు కోదండరాముని దర్శించి యుండవలెను. అప్పటినుండి యును ఈయనకు రామునియందు భక్తి విపరీతమాయెను. శ్రీకృష్ణుని అవతారము లన్నిటను పూర్ణమయిన గృహస్థాశ్రమ ధర్మముల పూర్ణముగా నాచరించి ధర్మసంస్థాపనను జేసిన అవతారము రామావతారమని యును, ఇదియే తన్ను సంసారమునుండి తను తరింపజేయుననియును భావించెను. ఆదిమధ్యాంతములు లేని అఖండతేజోవంతుడు పరిపూర్ణుడని తలచెను. వెంటనే ఆ దివ్యమంగళ విగ్రహమును తన హృదయమున ప్రవేశింపజేసికొనెను. దానితో మైమరచెను. అప్పటినుండియు ఈయన నిప్పుతొక్కిన కోతివలె గెంతదొడ్చెను.

ఈతడు గృహస్థు. గృహస్థునకు ఇహబంధనలనుండి తప్పించి పరమును జేర్చుటకు ప్రధానసహాయకులు 1 తల్లిదండ్రులు, 2 గురువు, 3 స్నేహితుడు, 4 సోదరుడు నని నలుగుర నేర్పరుచుకొని వారినందరను రామునియందు నిరూపించుకొనెను.

శ్రీరామార్పణమస్తు

పీఠిక సమాప్తము.

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో..........

# రామాయణము - రామమంత్రము



అవతారములలోకెల్ల రామావతారము యథాతథంబుగ వ్యావహారిక ధర్మముల నడిపి ధర్మమును స్థాపించినది. రాజయి రాజ్యపరిపాలనము చిరకాలముచేసిన యవతార మిదొక్కటియే. ఇందు మొదటి అంతరువున మమకారమను సుబాహుని జంపి అహంకారమను మారీచును దూరముజేసెను. అంతట అహల్యాశాపవిమోచనమను పాదదర్శనమును పొంది సహస్రారమున గల శివస్థానమును బయలుపరచి స్వాధిష్ఠానముగల మూలప్రకృతినిజేపట్టి దానిచేగలుగు మహావైభవమును తృణీకరించి రెండవ అంతరువును సన్నిహితమగు దండకారణ్యమున ప్రవేశించి అస్థానమున తపమొనర్చు మునులకు రాక్షసబాధలు లేకుండ జేసి వారి యాశీర్వచనబలంబుచే రెండవ అంతరువగు లంకలో ప్రవేశించి అహంకారమదోన్మత్తుడగు రావణుని సంహరించి మూలప్రకృతిని గని శివస్థానమున మూడవ అంతరములో ప్రవేశించి అచ్చట శివుని ప్రతిష్ఠించి అఖండసచ్చిదానందస్వరూపమున పరిపూర్ణసామ్రాజ్యమును బొందెను.

పరమపురుషస్థానము యొక్క రామమంత్రము వెలిభాగమగు నారాయణస్థానమునకు జేర్చు "ఓం. నమోనారాయణాయ' యను మంత్రములోని "రా" శబ్దమును, లోభాగమగు "ఓం నమోనీలకంఠాయ" యను దానిని చూపు "ఓం నమశ్శివాయ" లోని (మా) బీజమును సమన్వయపరుపబడి "రామ" యను నామమును ధరించెను. అవతారముల నామధేయములలో మహామంత్రముగా పరిగణింపబడునవి రామనామము. నారసింహనామము ఈరెండుయే. ఇవి రెండును స్థూలమగు మొదటి యంతరువులోని తేజస్సును విజృంభింపజేయును. అందు రామము సౌమ్యమయి వ్యావహారికస్థానమునుగూడ సరిచేయును. రామయనుటలో

(రా) యనుదాని స్వరము నాభిస్థానమువరకు బోయి అచ్చటి విష్ణుస్థానమును విజృంభింపజేసి శివస్థానమునకు మూలాధారమునగల "మ" తో జేర్చి అంతర్ముఖమునకు హంసను జేర్చుచున్నది. ఈ "రామ" యను నామము ఇతరనామములకంటె నెక్కువగా భజించుట మాత్రముననే భౌతికసుఖము నిచ్చి పారమార్ధికమునకు జేర్చుచున్నది. కావుననే భజన యనుటలో "రామభజన" యని వచించుటకు కారణము. యోగులు రామ మంత్రమును సిద్ధిని పొంది శివస్థానము జేరుచుండిరి. మహాఋషియగు వాల్మీకి తన తపోబలంబుచే గాయత్రీబీజంబుల సంపుటి పరచి పారాయణ గ్రంథముగ రచించెను. పారాయణ మాత్రముచే పవిత్రులయి పరమపురుషస్థానమున జేరగలరు. దాశరథీశతక గ్రంథకర్తయు నీమార్గమునే యనుసరించి తాను రచించిన పద్యముల తేజస్వంతములు చిరజీవిత్వముగల మహామంత్రములవలె జేసెను.

## రామాయణము - అంతరార్థము.

ప్రతి మనుజునియందును " 1 వ్యవహారికజ్ఞానము, 2 జ్ఞానము, 3 విజ్ఞానము, 4 ప్రజ్ఞానము" అను నాలుగవస్థలు నుండును. ఇందు మూలప్రకృతి 1 తార 2 మండోదరి 3 రుమ 4 సీత యను నాలుగు విధములుగా నుండును. వీరు 1 పాతాళ 2 మర్త్య 3 స్వర్గ 4 వైకుంఠ లోకముల నాశ్రయించియుందురు. ఇందు సాధకులు 1 ఐహికులు 2 ఐహికపారమార్ధికులు 3 పారమార్ధికమును జేరబోవుచు ఐహికముచే లాగబడువారు 4 ఐహికమును జయించి పారమార్ధికమును జేరువారు నాలుగు తరగతులవారు. వీరలే 1 వాలి 2 సుగ్రీవుడు 3 రావణుడు 4 దశరథుడు-జనకుడు. ప్రతి మనుజునకును భార్యలు ముగ్గురు. 1 కైక తనలాభమును చూచుకొని కీర్తినిచ్చునది. లోకసంబంధమైనది. 2 సుమిత్ర తన లాభమును తనవానిలాభమును చూచునది. దేహసంబంధమైనది.

? కౌసల్య ఆత్మసంబంధమైనది తన లాభమును వీడి తనవాని లాభ
మును చూచునది.

లోకసంబంధియగు కైకకు జనించిన కీర్తియను భరతునితో
లోకసంబంధియగు శత్రుఘ్నుడు చేరెను. ఆత్మసంబంధియగు కౌసల్యకు
జనించిన ప్రజ్ఞానరూపుడగు రామునితో దేహసంబంధియగు విజ్ఞానరూపు
డగు లక్ష్మణుడు చేరెను.

దశరధుడు—ఋణానుబంధముల ద్రెంచి దశేంద్రియములను దశ
రధముల గుఱ్ఱముల పగ్గములను బట్టి లోబరచుకొని ప్రజ్ఞానరూపుడగు
రామునిగవి మూలప్రకృతితో జేర్చినవాడు. గాయత్రియందలి 'భ'యను
బీజమున జనించి ఆఖరు 'ధీ'తో జేరినవాడు. కీర్తియను కామమును
వీడలేత స్వర్గలోకమును పొంది రావణవధానంతరం తిరుగారాముని
గనినవాడు.

సుగ్రీవుడు—విశుద్ధమందలి 'భ'యను బీజమున బుట్టి అంతర్ముఖ
మున గల 'ధీ' తో చేరబోయి మూలబలము చాలక స్వాధిష్టానమునగల
వాలిచే ఐహికమునకు లాగబడినవాడు. ప్రారబ్ధము ననుభవింపజాలక
పరమునకై పరితపించువాడు. ఇచ్చట నుండియే హంసనడక ఇదియే
హనుమంతుడు. ఇచ్చటగల శక్తిరుమ. ఇది ఐహికమున కుపయోగించు
నది కాదు. కావుననే వాలిసుగ్రీవు లిద్దరును తారతోడనే భోగించినట్లు
చెప్పబడినది. ఐహికముచే లాగబడుచు పారమార్థికముకై పరితపించు
చున్న సాధకుని తరింపచేయ ప్రజ్ఞానరూపుడగు భగవంతుడు విజ్ఞాన
రూపియగు లక్ష్మణునితో వచ్చెను. హంసరూపుడగు హనుమంతుడు
వీరిని సుగ్రీవునితో జేర్చెను. అదివరలో సుగ్రీవుడు హృదయకోశమను
పునాదును దిట్టపరుచుకొనక యుండుటచే స్వాధిష్ఠానమున గల వాలి
దిగలాగుచుండెను. సుగ్రీవుని బలమందుచే సగము తగ్గుచుండెను. దీనిని
గ్రహించి రాముడను గురుడు అపరిశుద్ధమగు విశుద్ధమును శుద్ధిచేయ

విజ్ఞానరూపుడగు లక్ష్మణునిచే సుగ్రీవుని మెడలో పూలమాలను వేయించెను. హృదయపద్మమును దిట్టపరచి స్వాధిష్టానమునకు లాగు 'కామమయ' నాడిని అంతర్ముఖముగా అణచివేసెను. అంతట సుగ్రీవునకు భౌతికము స్వాధీనమాయెను. తారతో భోగము లనుభవించుచు పరమును మరచెను. అప్పుడు గురుడగు రాముడు విజ్ఞానమను లక్ష్మణుని బంపి నీవు దశవిధనాదములు గల స్థానమున యున్న మూలప్రకృతియగు సీతను జూచినగాని లాభము లేదని మందలించెను. అంత జాలంధర బంధనచే సముద్ర బంధనముజేసి రెండవ యంతరువగు లంకలో ప్రవేశించి అందు దశవిధనాదముల నుపసంహ్వారించి శోకరాహిత్యమగు యశోకమూలమునగల మూలప్రకృతియగు సీతను రామునితో గలిపి సాకారపరబ్రహ్మమగు ఓంకారమను పుష్పకవిమానమునెక్కి మూడవ అంతరువగు శివస్థానమునకు వచ్చెను. ఇచ్చట శివప్రతిష్ఠను చేసెను. శివతత్వమున నీలకంఠస్థానమునగల నిజమగు తండ్రిని జూపునది తల్లియే గనుక అచ్చట ప్రతిష్టించబడిన లింగము సీతచేతనే సంగ్రహించబడెను. హంసరూపుడగు హనుమంతుడు తేజాలకపోయెను.

రావణుడు—ఇతడు పులస్త్య బ్రహ్మకుమారుడు. దశవిధనాదములను దశముఖములు గలవాడు. ఇతడిహపరముల రెండింటిని చాపచుట్టవలె జుట్టి యనుభవించదలచినవాడు. దినమునకు కోటిలింగముల నర్చించువాడు. దేహాభిమానమును వదలి నేత్రపద్మమును శివుని కర్పించినవాడు. "బ్రహ్మదండి"ని వీణాదండముగ జేసి పరమేశ్వరుని యానందపరచినవాడు. ఊర్ధ్వరేతస్కుడయి ఓంకారమున జనించిన జ్ఞానముచే వేదమునకు భాష్యమును వ్రాసినవాడు. ఖేచరాదిగమనము గల యింద్రజిత్తును గనినవాడు. ఏదయిన నేమి గాయత్రిని వీడి స్వశక్తిచే మూలప్రకృతిని పూర్తిగా స్వాధీనపరచుకొని సర్వశక్తుడు తానే కాదలచినవాడు.

జనకుడు— మూలప్రకృతిని అంతర్ముఖముచే పూర్తిగా గ్రహించి మూలపురుషునితో జేర్చినవాడు— పరిపూర్ణుడు.

కోతులు— నలుడు, నీలుడు, జాంబవంతుడు మొదలగువారు. వీరు తారకమందలి యొక్కొక్క కళయందే సిద్ధిని పొందినవారు. బ్రహ్మదండియందుగల తేజస్సు విజృంభించి సహస్రారమును చుట్టి ముఖమగు మూలాధారమును ఆవరించును. బ్రహ్మదండిగుండా అధోముఖమయినది ఊర్ధ్వముఖమయి విశుద్ధమున అంతర్ముఖముతో జేరును. స్థూల మెక్కువ బలముగలదయి యుండును. ఈ పరిస్థితిలో ఉల్లాస మధికముగా నుండును. హంస పక్షివలె ఆకాశగమనమును జేయుచుండును. వీరు ఒక్కొక్క విషయమున పూర్ణజ్ఞానమును గలిగియుందురు. సూక్ష్మరూపమును అతీతమగు స్థూలరూపమునుగూడ పొందుదురు.

## పంచకన్యలు.

శ్లో॥ అహల్యా ద్రౌపదీ సీతా తారా మందోదరీ తథా
పంచకన్యాః పఠేన్నిత్యం మహాపాతకనాశనమ్.

(1) సీత :— కేవలము మూలపురుషునియందే దృష్టిగలది. ఆజ్ఞేయచక్రమున నుండునది

(2) ద్రౌపది :— బాహ్యప్రకృతి లోబడకుండని మూలపురుషునివైపు నిరీక్షించునది. కర్ణములచే దెలిసికొనదగు సాకారపరబ్రహ్మమగు ఓంకారము నుపాసించునది. ఇదియే కర్ణుడు, సద్యోగర్భుడు.

(3) మందోదరి :— బలవంతముచే బాహ్యప్రకృతివైపు త్రిప్పబడిన ముఖముకలది. రావణునిచే బలాత్కారముగా గొంపోబడెను. మణిపూరకమున నుండునది.

(4) తార :— కేవల బాహ్యప్రకృతివైపు దృష్టిగలది. స్వాధిష్ఠానముననుండి యిహభోగముల నిచ్చునది.

(౫) అహల్య :—బాహ్యప్రకృతియం దిష్టములేక దానియందు చిక్కుకొని పూలపురుషుకై పరితపించునది. ఇంద్రియ వ్యాపారముల నరికట్టి స్థాణువువలె చలనరహితముగా మూలపురుషుని పాదదర్శనము లభించి పురుషుని జేరినది.

షరా :—ప్రభువుయొక్క యునికిని దెలసి ప్రభువుతో పరిచయమును గలిగించువారిలో ముఖ్యులు పరిచారికలే కదా ?

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# దాశరథీశతకము - భక్తియోగము.

## ఇష్ట దేవతా ప్రార్థన

నరజన్మమెత్తినందుకు సరసిజనాభుని సతంబు స్మరియించుచు త
చ్చరణములు మరువకుండిన గురఫలమగు జన్మమునకు గువ్వలచెన్నా.

అను రీతిని ప్రతివారును ఆస్తికుడయి శివరాముల నెవ
రినో యొకరిని తన కులదైవముగా నేర్పరచుకొని పెద్దలమార్గ
మున ఈశ్వరసేవను చేయవలెను. తనకార్యము నిర్విఘ్నముగా
నెరవేరుట కిష్టదైవమును ప్రార్థించవలెను.

శ్రీరఘురామ ! చారు తులసీదళధామ ! శమక్షమాది శృం
గారగుణాభిరామ ! త్రిజగన్నుతశౌర్యరమాలలామ ! దు
ర్వారకబంధరాక్షసవిరామ ! జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! 1

రామ ! విశాలవిక్రమ ! పరాజితభార్గవరామ ! సద్గుణ
స్తోమ ! పరాంగనావిముఖసువ్రతకామ ! వినీలనీరద
శ్యామ ! కకుత్థ్సవంశకలశాంబుధిసోమ ! సురారిదోర్బలో
ద్దామ ! విరామ ! భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ ! 2

అగణితసత్యభాష ! శరణాగతపోష ! దయాలసజ్ఝురీ !
విగతసమస్తదోష ! పృధివీసురతోష ! త్రిలోకపూతకృ
ద్గగనధురీమరందపదకంజవిశేష ! మణిప్రభాదగ
ద్ధగితవిభూష ! భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ ! 3

రంగతరాతిభంగ ! ఖగరాజతురంగ ! విపత్పరంపరో
త్తుంగ ! తమఃపతంగ ! పరితోషితరంగ ! దయాంతరంగ ! స
త్సంగ ! ధరాత్మజాహృదయ సారసభృంగ ! నిశాచరాబ్జమా
తంగ ! శుభాంగ ! భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ ! 4

శ్రీద ! సనందనాది మునిసేవితపాద ! దిగంతకీర్తి సం
పాదితసుప్రసాద ! భవపాశవిభేద ! విషాదవల్లికా
చ్ఛేద ! ధరాధినాథకులసింధుసుధామయపాద ! నృత్తగీ
తాదివినోద ! భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ ! 5

భా॥ ఓ యీశ్వరా ! నీచే సృష్టించబడిన సృష్టి యనంతము. అందు మనుజుడొక విధమున నుత్కృష్టుడుగను, మరియొక విధమున పరమ నికృష్టుడుగను పలుకబడుచున్నాడు. ఓ యీశ్వరా ! నేను నీ దాసుడను. ఏ కార్యకరణాచే నేనుత్కృష్టుడ కాగలనో, నీ యాజ్ఞ యెట్టిదియో నేను తెలిసికొనజాలకున్నాను. తెలిసినంతవరకైనను నెరవేర్చనా బాహ్యాభ్యంతర శత్రువులు నన్ను బాధించి యాటంకపరచుచున్నవి. నీవు సృష్టిస్థితిలయముల కాధారభూతుడవు. ధర్మసంస్థాపనకయి నీవు దాల్చు రూపము లనంతములు. మొదటినుండియును రఘువంశపురాజులు ధర్మరక్షణకయి నీ యంశచే జన్మించినవారు. అట్టి వంశమున నీవు నీ పరిపూర్ణాంశచే జన్మించితివి. కబంధుడు, రావణుడు, మారీచుడు మొదలగు ఎందరో రాక్షసుల సంహరించితివి. భక్తులవలన నెట్టి లోపములున్నను కాపాడువాడవు నీవే. ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక బాధలనుండి రక్షించు

వాడవు నీవేయని నమ్మియుంటిని. శారీరమానసికముల బల హీనుడను. నా లోపముల క్షమింపుము. నీ వన్న నో దయాసము ద్రుడవు. శరణన్న రక్షించు బిరుదు గలవాడవు. దుష్టుల శిక్షించి శిష్టుల రక్షించుటే పనిగలవాడవు. సనకసనందను లును, అనేకరాజర్షులును, రామదాసు, కబీరు, త్యాగరాజు మొదలగు ఎందరో మహాయోగులును నీ పాదముల సేవించి కృతా ర్థులయిరి కదా. దీనుడను. నా దీనత్వమును బాపి నన్ను కృతా ర్థుని చేయుము.

అవతారిక :— జీవన్ముక్తిని బొందగోరువారు మొదట చేయవలసినది పెద్దల సేవ. అనగా పెద్దలెచ్చటనున్న నచ్చటకు బోయి యతివినయముతో దూరముగా నుండి వారి వాక్యముల వినుట, వారి నడతల పరికించుట చేయవలెను. వారు చెప్పు మాటలకు వితండవాదనను చేయరాదు. వారికి సంతోషము కలుగునట్లు వారు చేయు సాధనల కనుగుణ్యామగు పనుల చేయు చుండవలెను. ఇట్లు కొంతకాలమయిన పిమ్మట నొక మహాసీ యుని గురువుగా నేర్పరచుకొనవలెను. కావుననే యీ క్రింది పద్యమున ముందుగా "ఆర్యులకెల్ల మ్రొక్కి" యనుగురుస్త వము నారంభించెను.

ఆర్యులకెల్ల మ్రొక్కి వినతాంగుడనై రఘునాథభట్ట రా
చార్యుల కంజలెత్తి, కవిసత్తములన్వినుతించి, కావ్యసాఫల్య మొ
నర్చ నొక్క శతకంబొనగూర్చి రచింతునేడు తా
త్పర్యమునన్ గ్రహింపుమిది దాశరథీ కరుణాపయోనిధీ! 6

భా॥ సత్యశీలురును, ధర్మాధర్మవిచక్షణులును, పరుల క్షేమమే తమక్షేమముగ భావించువారును, భక్తాగ్రేసరులు నయిన యో మహనీయులారా! నేను ఎల్లప్పుడును శ్రీరాముని పాదపద్మములనే సేవించునట్లును, శ్రీరామునకు నాపై పరిపూర్ణ కటాక్షము కలుగునట్లును నన్ననుగ్రహింపుడు. నావంటి దీనునకు దారిచూపుటకంటె ఘనకార్యము వేరెలేదుకదా. నేనే విధమున బ్రవర్తించిన మీావలె శ్రీరామునిదయకు పాత్రుడను కాగలనో దానిని నా కెరుకపరచుడు. ఆ రీతిని నేను వర్తించదగు శారీరక మానసిక శక్తులు నాకు గలుగునట్లు నన్నాశీర్వదింపుడు.

7, 8 అవతారిక :— ఈ క్రిందిపద్యమునుబట్టి చూచిన పూర్వకవులందరును ఏదియో నొక దేవత నుపాసించి, యా దేవతాప్రసాదము చేతనే తాము గ్రంథముల రచించి నట్లు భావించవలసియున్నది. లేకున్న వారి వారి గ్రంథములలో నింత రసపుష్టియు, సమయస్ఫూర్తియు, ఉత్తేజమును, విమలానుభూతియు, చిరజీవిత్వమును గలిగియుండుట యసంభవము.

మసగొని రేగుపండ్లకును మౌక్తికముల్వెల బోసినట్లు దు
ర్వ్యసనము జెంది కావ్యము దురాత్ములకిచ్చితి మోసమయ్యెనా
రసనకు పూతవృత్తి సుకరంబుగ జేకురునట్లు వాక్సుధా
రసములు జిల్కపద్య ముఖరంగమునందు నటింపవయ్య సం
తసమును జెంది భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ! 7

భా॥ ఓ యీశ్వరా! నీవు మానవునకు దయచేసిన మానసికశక్తి కంతములేదు కదా. అట్టి మానసికశక్తిని రేగు

పండ్లకయి ముత్యములను వెలయిచ్చినట్లు అశాశ్వతమగు నీ ప్రకృతిసుఖములకయి వినియోగించి చెడిపోతిని. నీవు నాపైని కృపగలవాడవయి యిదివరలో నభ్యాసపడియున్న నాదురభ్యాసముల నశింపచేయుము. నీ కృప లేక నేను వాటినుండి మరలజాలను.

శ్రీరఘువంశతోయధికి సీతమయూఖుడవైన నీపవి
త్రోరుపదాబ్జము ల్వికసితోత్పలచంపక వృత్తమాధురీ
పూరితవాక్ప్రసూనముల బూజలొనర్చెద జిత్తగింపుమీ
తారకనామ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ ! 8

భా॥ ఓరామా ! నీయొక్కగల అఖండతేజమును జూచు శక్తి నాకులేదు. కావున చంద్రునివలె చల్లనయిన నీహృదయమును పద్మములవలె మృదువైన నీపాదములను మాత్రమే నేను జేపట్టి నాకు నీవొసంగిన శక్తికొలది మాధుర్యముగల యీ చంపకవృత్తములను పుష్పములచే బూజించెదను.

9 అవతారిక :—ప్రేమ యెచ్చుట నధికముగా, నిష్కామ్యముగా నుండునో యచ్చట 'నీవు నేను' నను భావమున న్యూనాధిక్యతయుండదు. భక్తుని ప్రకృతి యెక్కువగా బాధించు నప్పుడు పరమేశ్వరుని దూరుటకు మొదలుపెట్టును. ఆ యవస్థ తానంతటనే విపరీతస్థితిలోనికి భక్తునకు దెలియకనే వచ్చును. అట్టి తప్పులు తన కావ్యమున వచ్చును గాన క్షమింపుమని ప్రార్థించుచున్నాడు.

తరణికులేశనాయెడల దప్పులు గల్గిన నీదునామ స
ద్విరచితమైన కావ్యము పవిత్రము కాదెవియన్నదీ జలం
బరగుచు వంకయైన మలినాకృతి బారిన తన్మహత్త్వమున్
దరమెగణింప నెవ్వరికి దాశరథీ కరుణాపయోనిధీ ! 9

భా॥ ఓ రామా ! పరసువేదిని తాకిన యినుమైనను బంగారమే యగునట్లు నీ పాదములపై బడు మానసిక పుష్పములు లోపములుగలవైనను పవిత్రము గలవియే యగుచున్నవి. కావున వానిని దయతో స్వీకరించి కరుణించుము.

10 అవతారిక :— కవి ఈశ్వరాంశములోనివాడు. ఈశ్వరానుగ్రహము లేక కవిత్వము సిద్ధించదు. కావున ఈశ్వర ప్రసాదముచే సిద్ధించబడిన శక్తిని యీశ్వరార్పణ జేయుటచే నిష్కామయోగము. వీరిచే భగవంతుడు లోకసంగ్రహార్థమయి గ్రంథముల వ్రాయించును.

పండితరక్షకుండఖిల పాపవిమోచనుడబ్జ సంభవా
ఖండల పూజితుండు దశకంఠ విలుంఠన చండకాండకో
దండ కళాప్రవీణుడను తావకకీర్తి వధూటికిత్తు బూ
దండలుకాక నాకవిత దాశరథీ కరుణాపయోనిధీ ! 10

భా॥ ఓ రామా ! బ్రహ్మరుద్రాదులచే బూజింపబడు నిన్ను నేనేవిధమున బూజింపగలను. దీనుడను. హీనుడను. నీవిదివరలో రావణాది వీరుల నెందరనో సంహరించి భక్తుల రక్షించి మహాకీర్తిని బొందితివి. కావుననే పూజించు పుష్పములు స్వల్పములైన వయినను వాసి నధికమయినవానిగా భావించి యనుగ్రహింపుము.

11 అవతారిక :— ఏ కాలమందున సహనము గల వారును అసహానముగలవారును ఉందురు. సాధకుడంవరను సంతోషపెట్టవలయు ననుబుద్ధిని విడువవలయును. ఎందువల్లననిన వేపచెట్టునకు తేనెపోసి పెంచినను దాని చేదు వదలదుకదా.

గురుతరమైన కావ్యరస గుంభనకబ్బురమంది ముష్కరుల్
సరసులు మాడ్కి సంతసిల జాలుదురోటి? శశాంక చంద్రికాం
కురముల కింద కాంతమణి కోటిస్రవించిన భంగి వింధ్య భూ
ధరమున జారునే శిలలు దాశరథీ కరుణాపయోనిధీ! 11

భా॥ ఓ రామా! లోకములో కొందరు నీచులు తమకు లాభములేకున్నను నెదుటివారి సత్కార్మల భంగపరుప జూచుచుందురు. కావున అట్టి దుర్మార్గుల బారినుండి రక్షింపుము.

12, 13, 14 అవతారిక :—ఇట్లు ముందు తాచేయబోవు కార్యమునకు మధ్యవచ్చు నవాంతరములకు గల నంశయముల విచ్ఛేద మొనర్చుకొని భగవంతుని ధ్యానింప మొదలిడుచున్నాడు.

శ్రీరమణీయహార! యతసీకుసుమాభశరీర! భక్తమం
దార! వికారదూర! పర్వతత్వవిహార! త్రిలోకచేతనో
ద్ధార: దురంతపాతకవితాన విదూర! ఖరాదిదైత్యకాం
తారకుతారధార! భద్రగిరి ధాశరథీ కరుణాపయోనిధీ! 12

భా॥ ఓ రామా! నేను ఇదివరలో ఎరిగిగాని ఎరుగకగాని చేసిన పాపములు కొండలవంటివై యుండునంటివేమో. నీవఖండశక్తివంతుడవు. పరత్వమందుండువాడవు. భక్తులకు మందార

వృక్షమువంటివాడవు. కావున నా దోషములన్నియు బోయి నిన్ను సేవించుట కర్హుడనుగా తలచి ప్రార్థించుచున్నాను.

దురితలతాలవిత్ర ఖరదూషణ కాననవీతిహోత్ర ! భూ
భరణకళావిచిత్ర ! భవబంధవిమోచన సూత్ర ! చారు వి
స్ఫురదరవిందనేత్ర ! ఘనపుణ్యచరిత్ర ! వినీలభూరి వా
రిదసమగాత్ర ! భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ ! 13

భా॥ ఓ రామా ! కొండలవంటి దూదికుప్పలను నొక్క యగ్నికణము త్రుటిలో దహించునట్లురిగి గాని, యెరుగకగాని నే జేసిన పాపములు నీ నామస్మరణచే త్వరలో నశింపకుండునా? నీ శక్తికి అంతులేదుకదా. పాపముల సంహరించుటలో నీకు గల నేర్పు వేరికిగలదు ? కావున నా పాపముల నశింపజేసి నన్నను గ్రహింపుము.

కనకవిశాలచేల ! భవకానన శాతకుఠారధార ! స
జ్జన పరిపాలశీల ! దివిజస్తుత సద్గుణకాండ ! కాండ సం
జనిత పరాక్రమక్రమ విశారద కందకుంద చం
దన ఘన సారసారయశ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ ! 14

భా॥ ఓ రామా ! నీకు భక్తులపై గల వాత్సల్యముచే భక్తులమనములు నీయందు లీనమగుటకు నీలమేఘచ్ఛాయ గల నీ దేహముపై పదునారవ వన్నెగల బంగారమువంటి పచ్చని వస్త్రమును ధరించితివి. దుర్జనుల శిక్షించి సజ్జనుల రక్షించు మహాయశస్సుతో నలుదిక్కుల ప్రకాశించుచుంటివి.

15 అవతారిక :— అవతారములకెల్ల రామావతారము పరిపూర్ణావతారమనియును, సగుణముగను నిర్గుణముగను తరింప చేయుననియును రామునుపాసించి ధ్యానించుచున్నాడు. ఉపాసకుడు తన యిష్టదైవమును ఎట్టి భావముతో నుపాసించిన అట్టి పరిస్థితిని బొందును. మనము చేరవలసినది పరిపూర్ణస్థానమే గనుక రాముడు పరిపూర్ణుడను భావమును గలిగి యుపాసించవలెను.

అజునకు దండ్రివయ్యు. సనకాదులకున్ బరతత్వమయ్యు స
ద్విజమునికోటికెల్ల కులదేవతవయ్యు. దినేశవంశభూ
భుజులకు మేటివయ్యు. పరిపూర్ణుడవై వెలుగొందు పక్షిరా
డ్ధ్వజ ! మిముఁబ్రస్తుతించెదను దాశరథీ కరుణాపయోనిధీ ! 15

భా॥ ఓ రామా ! నీవు పరిపూర్ణుడవు. కావుననే బ్రహ్మేశ్వరుడు సహితము నీ నామమును స్మరించుచున్నారు. సమస్త దేవతలును నిన్నే భజించి వారి కార్యముల నెరవేర్చుకొనుచున్నారు. కావున నన్ననుగ్రహించి వారివలెనే నేనును నిన్ను నిరంతరమును ధ్యానించువాడనుగా జేయుము.

16 అవతారిక :— సాధకునకు పరమేశ్వరునియందు భక్తియధికమగు కొలదిని ప్రకృతి యెక్కువగా బాధించుచుండును. కావున సాధకుడు తన్ను ప్రకృతిబాధలు వదలనంతవరకును రాముని కోదండముగల వానిగా ధ్యానించవలెను. ఇట్లు భక్తపాలనకయి శ్రీరాముడు కోదండముతో భద్రాద్రి

యందు వెలసెను. ఈ మహనీయుడా కోదండరాముని యొక సారి చూచి వచ్చి యీ శతకమును రచించెను.

శ్రీరమ సీతగాగ, నిజసేవకబృందము వీరవైష్ణవా
చార్య జనంబుగాగ, విరజానది గౌతమిగా, వికుంఠము
న్నారయ భద్రశైలశిఖరాగ్రముగా, నెలకొన్న చేతనో
ద్ధారకుడైన విష్ణుడవు దాశరథీ కరుణాపయోనిధీ! 16

భా॥ ఓ రామా! నీవు ఆదివిష్ణువుయొక్క పూర్ణావతారము. ఆదిలక్ష్మియే సీత. నీ భక్తులే వైకుంఠవాసులు. విరజానదియే గోదావరి. వైకుంఠమే భద్రాచలము. భక్తుల పాలింప సపరివారముగా నవతరించితివి.

17, 18 అవతారిక :— సాధకుడు తన యిష్టదైవము నిట్లు నిశ్చలచిత్తముతో భావించి ధ్యానించుచు నా ధ్యానముచే కన్నుల మూయును. అంత నా దివ్యమంగళ విగ్రహము తన హృదయమున శంఖచక్రాదులతో నిజరూపమును గనుంగొని ధ్యానందమును వెలిబుచ్చును. ఇదియే సాధకుని సగుణారాధన యందలి పారవశ్యఫలితము. దీని నీ క్రింది పద్యమున వెలిబుచ్చుచున్నాడు.

కంటినదీతటంబు, పొడగంటిని భద్రనగాధివాసముం,
గంటి విలాతనూజ, మురుకార్ముకమార్గణ శంఖచక్రముల్
గంటిని, మిమ్ము లక్ష్మణునిగంటి, కృతార్థుడనైతినో జగ
త్కంటకదైత్యనిర్దమన దాశరథీ కరుణాపయోనిధీ! 17

భా॥ ఓ రామా ! గొప్పదైన విల్లు బాణములను శంఖ చక్రములను, నొకవైపున సీతయు, నొకవైపున లక్ష్మణుండును గలిగి గోదావరియొడ్డున భద్రాచలముపై నున్నట్టి నిన్ను గనుంగొను భాగ్యము నాకు లభించినది. ఇక నాకేమికోరిక గలదు.

హాళికునకున్ హలాగ్రమున నర్థముచేకురు భంగి, దప్పిచే
నలమటజెందు వానికి సురాపగతోయజ మబ్బునట్లు దు
ర్మలిన మనోవికారియగు మర్త్యుని నన్నొకగూర్చియాపయిన్
దలపుఘటింప జేసితివి దాశరథీ కరుణాపయోనిధీ ! 18

భా॥ ఓ రామా ! దీనదయాళో ! దరిద్రుడగు వ్యవసాయదారునకు దున్నుకొనుచుండగా నాగటినక్కునకు పెన్నిధి లభించునట్లును మిగులదాహముతో నున్నవానికి ఎడారిలో గంగాజల మబ్బినట్లును కొండలవంటి మహాదోషములతో నున్న నాకు నీ పరిపూర్ణ దర్శన మబ్బినది. ఇక నా యదృష్టమేమందును!

19 అవతారిక :— సాధకుడు సగుణోపాసనలో లభించిన భగవంతుని సాక్షాత్కారమునకు ఆనందపరవశుడయి తన్ను వదలిపోకుండ తన హృదయమున స్థాపించుకొని ధ్యానించవలెను. సాధనలో దిగువరకే శాస్త్రవిచారణ. సాధనలో గల సాధకుడు శాస్త్రవిచారణను మానవలెను. శాస్త్రవిచారణ నిజమగు వస్తువును చూపలేదు.

కొంజకతర్కవాదమను గుద్దలిచే బరతత్వభూస్థలిన్
రంజిలద్రవ్వి గన్గొనని రామనిధానము నేడు భక్తి సి

ద్ధాంజనమందు హస్తగతమయ్యె, భళీయనగా, మదీయ హృ
త్కంజమునన్ వసింపుమిక దాశరథీ కరుణాపయోనిధీ ! 19

భా॥ ఓ రామా ! శాస్త్రవాసనచేగాక సాధనచతుష్టయ
మును గలిగి యోగులు తమ యోగసాధనచే తమ దృష్టి నంత
ర్ముఖముజేసి యెట్లు నీ పాదదర్శనమున తరించెదరో అట్లనే
నీ నామస్మరణచేతను నీ పాదపూజాధ్యానాదులచే నీ పాదదర్శ
నము నాకు లభించినది. దానిని నిరంతరము నా హృదయసీమను
విడకుండ నన్నునుగ్రహింపుము.

20, 21 అవతారిక :—ఈపై వివరింపబడినది సాధకుని
ప్రథమసోపానసిద్ధి. దీనితో సాధకునకు మూలాధారస్వాధిష్ఠాన
దోషములు చాలవరకు హరించును. ఇదియే భగవంతుని
నూలపాదుకాదర్శనము. ఇచ్చట సాధకునకు భగవంతునియందు
నిశ్చలబుద్ధి నమ్మకము కలుగును.

రాముడు, ఘోరపాతకవిరాముడు, సద్గుణకల్పవల్లికా
రాముడు, షడ్వికారజయరాముడు, సాధుజనావనవ్రతో
ద్దాముడు, రాముడే పరమదైవము మాకనియెంచి యద్దు కెం
దామరలే భజించెదను, దాశరథీ కరుణాపయోనిధీ ! 20

భా॥ ఓరామా! షడ్వికారదోషముల నశింపజేయుటలో
నీపాదదర్శనమును మించినది వేరొండు లేదు. అట్టి నీపాదదర్శ
నము నాకు లభించినది. వాటిని విడువక భజించెదను.

చక్కెరమానివేముదిన జాలనికైవడి మానవాధముల్
పెక్కురు బక్కదైవముల వేమరుగొల్చెదరట్లకాదయా

మ్రొక్కిన నీకు మ్రొక్కవలె మోక్షమొసంగిన నీవయీవలెన్
దక్కినమాటలేమిటికి దాశరథీ కరుణాపయోనిధీ ! 21

భా॥ ఓ రామా ! కొందరు మూఢులు నీ పరిపూర్ణత్వము తెలిసికొనలేక యితర దేవతల సేవించెదరు. ఇతర దేవతలొక్కొక్కరు ఒక్కొక్క కార్యమునే చేయగలరు. నీవు పరిపూర్ణుడవగుటచే నిన్ను సేవించినవారు సకల కార్యముల నెరవేర్చికొనినవారయి పరిపూర్ణత్వమును పొందగలరు.

22, 23, 24 అవతారిక :—శ్రీరాముని కృపచేతనే తన కిల్బిషములన్నియును హరించి పరమపదమును చేరగలనను నిశ్చయబుద్ధిచే రాముని స్తుతించుచున్నాడు. ఇట్లు స్తుతించుటలో తన స్వరము సూక్ష్మమునకు బోయి నిలచును. అట్టి పరిస్థితిలో అచ్చటినుండి పలుకు స్వరమునకు మితిమేరయుండదు. ఆ యవస్థ ఎంతవరకుండునో తెలియదు. ఆ సమయమునందితరులకు పిచ్చివానివలె తోచును.

రా. కలుషంబులెల్ల బయలంబడ ద్రోచిన; మా. కవాటమై
డీకొని త్రోచు నిక్క; మని ధీయుతులెన్న దదీయవర్ణనల్
గైకొని భక్తిచే నుడువగానరుగాక విపత్పరంపరల్
దాకొనునే ? జగజ్జనులదాశరథీ కరుణాపయోనిధీ ! 22

భా॥ ఓ రామా ! నీ నామమందలి రెండక్షరముల మహిమను ఏమందును ! నీ నామమందలి (రా) బీజము పాపముల పైకి త్రోసివేయుచుండగా, రెండవదగు (మా) బీజము పాప

ములు తిరుగ ప్రవేశించకుండ తలుపువలె మూయుచున్నది. అనగా మొదటిదగు (రా) బీజము గత కర్మకల్మషముల నశింప జేయుచున్నది. (మా) బీజము తిరిగి చేయకుండ అంతర్ముఖము నకు జేర్చుచున్నది. దీనివలననేగదా వాల్మీకి తన పూర్వదోష ముల దొలగించుకొని పూర్ణజ్ఞానియయ్యెను. అట్లే నన్నును కాపాడి రక్షింపుము.

రామహరే! కకుత్స్థకులరామహరే! రఘురామ రామ శ్రీ
రామహరే! యటంచు మది రంజిల భేకగళంబులీల నీ
నామము సంస్మరించిన జనంబు భవంబెడబాసి తత్పరం
ధామ నివాసులౌదురట దాశరథీ! కరుణాపయోనిధీ! 23

భా॥ ఓరామా! ఆర్తరక్షామణీ! దీనచింతామణీ! నీశక్తి యనంతము. నీనామరూపాము లనంతములు. నిన్ను నమ్మినవారికి నీవు కామధేనువవు. నీనామమెా పరమపావనము. దానిని పొగడ నెవరితరము! వేయి ముఖములుగల ఫణికైన తనివి తీరునేమెా!

దారుణపాతకాబ్ధికి సదాబడబాగ్ని. భవాకులార్తివి
స్తారదవానలార్చికి సుధారసవృష్టి. దురంతదుర్మతా
చారభయంకరాటవికి దండకఠోరకుఠారధార. నీ
తారకనామముం దలతు; దాశరథీ! కరుణాపయోనిధీ! 24

భా॥ ఓరామా! నీ నామమహిమను ఏమందును! నీనామస్మరణచే దహించని పాపములుగాని తీరని భయములు

గాని యుండవు. ఎంతటి దురాచారినయినను సదాచారునిగా మార్చివేయును. భక్తుని పరమపావనునిగా జేయును.

25–30 అవతారిక :—ఈ అవస్థ వచ్చుసరికి సాధకునకు సంసారమందు రోతపుట్టి శ్రీరామక్షేత్రముల దిరుగుచు నందలి మహిమల కానందించుచు సర్వమును రాముడే యను భావముతో లోకమును మరచి శ్రీరాముని ధ్యానించుచుండగా భగవంతుని కృపచే రూపమునకు అనుగుణ్యమును అతీతమును అగు మంత్రమును ఎవరోయొక మహనీయుడు వచ్చి యుపదేశించును. ఇట్లు సంసారమందలి విముఖత సాధకునకు తనంతనే కలుగవలయునుగాని కోరితెచ్చుకొనిన నిలువదు. ఇట్టి పరిస్థితిలోనివాడు యాత్రల నెంతవరకు జేసినను కాలినడకనే చేయవలెను. ఎప్పుడు సంగమందు విముఖత కలిగి తన స్థానమును విడుచునో అప్పటినుండియును తాను సంచరించిన స్థలమంతయును మహాక్షేత్రముగను, తాను చూచినవారందరును మహనీయులుగను, తాను చూచినదంతయును ఆ యీశ్వరుని లీలగను రూపానందించి పరవశమందును. ఈ పరిస్థితి సాధకునికే యనుభవము. ఈ పరిస్థితిలో నుండి తపించునపుడే సాధకునకు తగిన గురుడు లభించును. అట్టి పరిస్థితిని అట్టి గురునిచే పొందబడిన మంత్రము సూక్ష్మమగు హంసస్థానమున జేరి మహాశక్తివంతమయిన దగును. ఇట్లు సాధకుడు సంసారమును వీడినను భయమును, జిహ్వాదోషమును వెన్నంటి నడచును. వీటి నీ క్రింది

25 వ పద్యమున పొందబడిన మంత్రముచే నశింపజేసికొని 26-31 వరకు వాని పరిస్థితులు నిరూపించుచున్నాడు—కొందరు గృహమందుండియు నీ పరిస్థితిని పొందుదురు. గాని చాల దుస్తరము.

హరునకు. నవ్విభీషణున కద్రిజకున్ దిరుమంత్రరాజమై
గరికి. నహల్యకున్. ద్రుపదకన్యకు నార్తిహరించు చుట్టమై
పరగినయట్టి మీపతితపావననామము జిహ్వపై నిరం
తరము నటింపచేయుమిక దాశరథీ! కరుణాపయోనిధీ! 25

భా॥ ఓ రామా! నీ నామమహిమ యెట్టిదియోగాని ఈశ్వరుడు తన భక్తులకుపదేశించి తరింపజేయుచున్నాడు. నీ నామమహిమ విభీషణుని లంకారాజ్యమునకు రాజుగాజేసెను. అహల్యకు శాపవిమోచనను (నిర్మలచిత్తను) జేసి పాదదర్శన మిచ్చి నిజపురుషుని చేర్చెను. ద్రౌపదిని శత్రువులగు కౌరవుల నశింపజేసి మహాసామ్రాజ్యమునకు రాణినిగా జేసెను. అట్టి నీ నామము నాజిహ్వను నిరంతరమును నీడకుండ చేయుము.

ముప్పున గాలకింకరులు ముంగిట వచ్చినవేళ, రోగము
లెప్పరమైనచో. గఫము కుత్తుక నాడెడువేళ. బాంధవు
లప్పినవేళ మీస్మరణ గల్గునొ గల్గదొ నాటికిప్పుడే
తప్పకజేతు మీస్మరణ దాశరథీ! కరుణాపయోనిధీ! 26

భా॥ ఓ రామా! జీవము బుద్బుదప్రాయము, ఎప్పటికే స్థితి సంభవించునో యను భయముచే నేను తొందరపడి తగిన

ఉపకరణలు లేక నీ మంత్రమును విరామము లేకుండ జపించు చున్నందుకు క్షమించుము. నా జపమున కంతరాయము కలుగ కుండ రక్షింపుము.

పరమదయానిధే ! పతితపావననామ ! హరే ! యటంచు సు
స్థిరమతులై సదా భజనసేయు మహాత్ములపాదధూళి నా
శిరమునదాల్తు మీరటకు జేరకుడంచు యముండు కింకరో
త్కరముల కానబెట్టెనట దాశరథీ ! కరుణాపయోనిధీ ! 27

భా॥ ఓ రామా ! నిరంతరమును నీ నామమును స్మరించు వానిగా నన్ననుగ్రహింపుము. హనుమంతుడు, విభీషణుడు, మొదలగు ఎందరో భక్తులు నీ నామమును స్మరించుచు చిరంజీవులై యున్నారు. నీ నామమును స్మరించు వారిచెంతకు పోవలదని యముండు తలకింకరుల కాజ్ఞయిచ్చెనట కావున నాకు మరణభయము లేదు.

చక్కెరలప్పకున్ మిగుల జవ్వనికిన్ జిగురాకు మోవికిన్
జొక్కపు జుంటితేనియకు జొబ్బిలుచున్ గనలేరు గాకనే
డక్కట రామనామ మధురామృత మానుటకంటె సౌఖ్యమా
తక్కిన మాధురీమహిమ దాశరథీ ! కరుణాపయోనిధీ ! 28

భా॥ ఓ రామా ! నీ నామమందలి రెండక్షరములకు గల మాధుర్యముతో సాటియయిన దెందయినను గలదా ! మానవులు మూఢులయి, కోడి, రత్నమును జూచి కాళ్ళదన్ని గింజలకై పరితపించునట్లు మలమూత్రముల కాటపట్టయిన స్త్రీల

యధరములందలి చొంగకును ఇతర పదార్థములకును పరితపించెదరు.

అండజవాహ ! నిన్ను హృదయమ్మున నమ్మినవారి పాపముల్
కొండలవంటివైన వెసగూలి నశింపకయున్నె ! సంతతా
ఖండలవైభవోన్నతులు గల్గక మానునె ! మోక్షలక్ష్మికై
దండయొసంగకున్నె ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! 29

భా॥ ఓ రామా ! ప్రజలు జ్ఞానశూన్యులయి సమస్త దోషముల పారదోలి సమస్త వైభవముల కతీతమగు నానందమును నీ నామస్మరణ కలుగజేయుచుండగా దానిని గనలేక తుచ్ఛసుఖంబులకై యనేక నీచమార్గముల నవలంబించుచున్నారు.

చిక్కని పాలపై మిసిమిజెందిన మీగడ పంచదారతో
మెక్కినభంగి. నీవిమలమేచకరూపసుధారసంబు నా
మక్కువ పళ్లెరంబున సమాహితదాస్యమనేటి దోసిటన్
దక్కెనటంచు జుఱ్ఱెదను దాశరథీ ! కరుణాపయోనిధీ ! 30

భా॥ ఓ రామా ! నీ రూపమును నీ లావణ్యమును నీ ముఖకమలమందలి మార్దవమును దలచినకొలదియును నా తనివితీరుట లేదు. కావున నీవు నాయందు దయగలవాడవయి తొందరపడి పారిపోవక కొంతతడవు నిలిచి నా తనివిని తీర్చుము.

31 అవతారిక :— ఇట్లు సాధకుడు భగవంతుని తన హృదయ పద్మమున నిలుపుకొని ధ్యానించుచుండగా కొన్ని యుచ్ఛిష్టభూతములును ఇతర యైహికబాధలును తన ధ్యాన

మున కాటంకము కలుగరాకుండ కాపాడుటకయి భగవంతునే యన్నివిధముల రక్షించువానిగా నేర్పాటు చేసికొని ప్రార్థించు చున్నాడు.

సిరులిడ సీత. పీడలెగజిమ్ముటకున్ హనుమంతు. డింత సో
దరుడు సుతమిత్రసూతి దురితంబుల మానుప. రామనామమున్
గరుణదలిర్ప మానవులగావగ బన్నిన వజ్రపంజరో
త్కరముగదా భవన్మహిమ దాశరథీ! కరుణాపయోనిధీ! 31

భా॥ ఓ రామా! బాహ్యప్రకృతియందు మనస్సుపోవక నీయందే తగులుకొను మహాసంపద నిచ్చుటకు సీతయును, నిన్ను ధ్యానించుటలో నెట్టి విఘ్నములును రాకుండ కాపాడు టకు హనుమంతుడును, అజ్ఞానముచే ప్రాపంచిక సుఖములకు లోనయి దుఃఖింపకుండ విజ్ఞానరూపుడగు నీసోదరుడు లక్ష్మణు డును ఇదివరలో చేసిన పాపముల భయము లేకుండ నీనామ మును భక్తుల పాలింప నీవేర్పాటుచేసిన ఉక్కు కవచముకదా.

32 అవతారిక :—ఇట్లు సాధకుడు శ్రీరామరక్షచే నిశ్చింతగలవాడయి ధ్యానించుచు పాదదర్శనము ప్రాప్తించిన వాడాయెను. పాదదర్శనమే పూర్ణదర్శనమునకు ఆధారము. పాదదర్శనమునుబట్టి చేపట్టబడిన పూర్ణదర్శనమే తేజోవంత మయినది. స్థిరమయినది. మనయందలి పరమేశ్వరు తేజో వాహిని పాదములు చిగుళ్లుగా శిఖాంతమువరకు వ్యాపించి యున్నది. దానిని ఆదిభౌతికస్థూల మావరించుకొని యది యును యాతేజస్సుతో ప్రకాశింపబడుచున్నది.

పాదదర్శనమను తేజస్సునుబట్టి క్రమముగా లోచూపుతో పయికి పోయిన అంతర్ముఖ తేజస్సుతో కలుపుచున్నది. ఇచ్చటినుండి లోచూపుగా పైకి నడుపుచు స్థిరముగా తన లక్ష్యమును నుంచువాడే అంతర్ముఖుఁడు.

హలకులిశాంకుశధ్వజ శరాసనశంఖరథాంగ కల్పకో
జ్జ్వలజలజాతరేఖలను సాంకములై గనుపట్టుచున్న మీ
కవిత పదాంబుజద్వయము గౌతమపత్ని కొసంగినట్లు నా
తలపున జేర్చి కావగదె దాశరథీ ! కరుణాపయోనిధీ ! 32

భా॥ ఓరామా ! ప్రకృతిరూపమైన యహల్య తన ప్రకృతి రూపమును స్తంభింపజేసి శిలవలె నింద్రియవ్యాపారములు లేనిదయి తదేకనిష్ఠతో తపించగా నీపాదదర్శనమును లభింపజేసి కాపాడితివి. అట్టి శుభరేఖలతోగూడిన నీపాదదర్శనమును నాకు లభింపజేసి నన్ను కాపాడుము. ఇచ్చటి రేఖలు కేవలము తెలుపు, ఎరుపు-తెలుపు మిశ్రమము.

ఈపద్యమున బాహ్యదృష్టిని అంతర్ముఖము చేసికొనుట ఎంతకష్టతరమయినదియో నిరూపించుచున్నాడు.

జలనిధిలోనమాటి కులశైలముమీటి ధరిత్రి కొమ్మునన్
దలపడమాటి రక్కసుని యంగముగీటి బలీంద్రునిన్ రసా
తలమునమాటి పార్థివకదంబము గూల్చినమేటి ! రామ ! నా
తలపుననాటి రాగదవె దాశరథీ ! కరుణాపయోనిధీ ! 33

భా॥ ఓరామా ! అహంకార మమకారములచే మరుగుపడియున్న నీయఖండతేజము పట్టువడుట ఎంతకష్టతరమయినది.

నీకృపచే దానిని బయలు పరచి నాహృదయసీమను నిలిపి అహల్యవలె నన్ననుగ్రహింపుము.

34, 35 అవతారిక :—ఇట్లు అంతర్ముఖముచే గనుంగొనబడిన పూర్ణ తేజస్సుయొక్క ఆవేశమును ఈక్రింది పద్యముల వెలిబుచ్చుచున్నాడు.

ఖండనభీము, డార్తజనబాంధవు, డుజ్జ్వలబాణతూణకో
దండకళాప్రచండ భుజతాండవకీర్తికి, రామమూర్తికిన్
రెండవ సాటిదైవమిక లేదనుమన్ గడకట్టి భేరికా
డాండడడాండడాండ నినదంబు లజాండమునిండ మత్తవే
దండమునెక్కి చాటెదను; దాశరథీ! కరుణాపయోనిధీ! 34

భా॥ ఓమూఢమానవులారా! మేల్కొనుడు. రండు ఎటువంటి దారుణశత్రువులనైనను తృటిలో బరిమార్చి జ్ఞానజ్యోతి నొసంగుటలో రామునితో సమానుడగు మహావీరుడు వేరొండు లేడని బాగుగా దెలిసి సుఖింపుడు. లోకులందరును సుఖింప మీశక్తి కొలది చాటుడు. ఇది సత్యము. ముమ్మాటికిని సత్యము.

అవనిజకన్నుదోయి తొగలందు వెలింగెడు రామ! జానకీ
కువలయనేత్ర గబ్బిచనుకొండలనుండు ఘనంబు, మైథిలీ
నవనవయౌవనంబను వనంబునకున్ మదదంతివీవెకా!
తవిలి భజింతునెల్లపుడు దాశరథీ! కరుణాపయోనిధీ! 35

భా॥ రామా! ఏ మూలప్రకృతి నీకు బాహ్యశరీరియై ఎల్లప్పుడును నీయందే సుఖము కలదయి నిన్ను కౌగలించు

కొని యానందించుచున్నదో యట్లు ప్రకృతిజన్యమగు బాహ్యా ముఖముననున్న నామనస్సును నీవై పునకు త్రిప్పుకొని నిన్ను విడనాడకుండజేసి యానందించునట్లు నన్ననుగ్రహింపుము.

38, 53 :—ఈ సమయముననే భక్తునకు భక్తి దృఢ మగుటకు భగవంతుడు భక్తుని కొన్ని చిక్కులలో బెట్టును. వేగముగా తనలో జేర్చుకొనుటకు భక్తుని ప్రారబ్ధము వేగముగా నశించునట్లు చేయును. భోగము లెక్కువగా గలిగిన తన్ను మరచునని యట్టిభోగముల కంతరాయమును గలిగించును. కడకు సోదరులు భార్యాపుత్రుల సహాయము లేకుండ చేయును. అప్పుడు సాధకుడు అవి తన కర్మఫలితములని భావించి వానిని నివారించువాడు ఈశ్వరుడే యని తలంచును. కాని అవి తన్ననేకవిధములగు తికమకలలో బెట్టుచు తన ధ్యానమున కంత రాయమును గలిగించును. ఇదియే భక్తునకు అరణ్యపర్వము. ఇచ్చట భక్తునకు గొంత జ్ఞానము లభించును. దానిచే వాడు తన తప్పులను ముందు పొందవలసిన ఈతిబాధలను జ్ఞాపకము నకు తెచ్చికొనుచుండును. ఇవి అదివరలో తానుజేసిన తప్పుల ఫలితమా? లేక ఇప్పుడెట్టి తప్పుల చేయుచుంటిని? లేక ఈశ్వ రుడు తన్ను పరీక్షించుట కిట్లు చేయుచుండెనా? నేనేదారిని ద్రొక్కవలెను? నాకెవరు దిక్కు? అని అనేక విధముల దుర పించుచుండును. పాదదర్శనమును పైకి నడుపుచు ఆనందించు చుండును.

ఖరకరవంశజా ! విను మఖండిత భూతపిశాచఢాకినీ
జ్వరపరితాప సర్పభయవారకమైన భవత్పదాబ్జవి
స్ఫురదురు వజ్రపంజరముఁ జొచ్చితి. నీమెడ దీనమాన
వోద్ధరబిరుదాంక మేమరకు; దాశరథీ ! కరుణాపయోనిధీ ! 36

భా॥ ఓరామా ! అజ్ఞానమను తిమిరమును బోగొట్టె సూర్యవంశమున బుట్టినవాడవు. నీకు నాయెడగల ప్రేమను తెలిసికొనజాలక భయంకరమగు భూతప్రేత పిశాచములు హింసింప సమకట్టెనవి. నీపాదాబ్జములే నాకు దిక్కు. నీవు దీన రక్షకుడవను బిరుదు గలవాడవు. నన్ను మరువక కాపాడుము. నీవు ఏమాత్ర మేమరియున్నను నన్నవి కష్టసముద్రములో ముంచివేయును. నీబిరుదముల కంతరాయమును కలిగించుకొనక నన్ను కాపాడుము.

జుర్రెద మీకథామృతము. జుర్రెద మీపదకంజతోయమున్
జుర్రెద రామనామమున జొబ్బిలునట్టి సుధారసంబు. నే
జుర్రెద జుర్రజుర్రగ. రుచుల్ గనువారిపదంబు గూర్పవే !
తర్లులతోడి పొత్తిడక దాశరథీ ! కరుణాపయోనిధీ ! 37

భా॥ ఓనాయనా ! శ్రీరామచంద్రా ! శ్రీకృష్ణావతారమున నుట్టెలలోని కుండలకు తూటొనరించి పాలు పెరుగుల నీవు నీసఖులతో త్రాగిన రీతిని నీపావనమైన చరిత్రామృతమును, నామామృతమును, నీపాదపద్మములయందలి తేజమును నాతనివితీర జుర్రెద. అట్లు జుర్రగా జుర్రగా కలుగు సంపూర్ణానందమును ఎట్టి యాటంకమును రాకుండ ననుభవించ నన్నను గ్రహింపుము.

ఘోరకృతాంతవీరభటకోటికి గుండెదిగు.ల్దరిద్రతా
కారపిచాచసంహరణ కార్యవినోదవికుందమందిర
ద్వారకవాటభేది. నిజదాసజనావళికెల్ల బ్రొద్దునీ
తారకనామ; మెన్నుకొన దాశరథీ! కరుణాపయోనిధీ! 38

భా॥ ఓరామా! నీనామము భయంకరమగు శాకినీ ఢాకినీ మొదలగు పిశాచముల సహితము దిగులొందించును. మోక్షద్వారమునగల కవాటమును తెరచు తాళము నీనామమే కదా! ఎంతని నీనామమహిమను వర్ణించగలను!

విన్నపమాలకించు. రఘువీర! యహిప్రతిలోకమందు నా
కన్నదురాత్ముడున్. బరమకారుణమొప్పగ వేల్పులందు నీ
కన్నమహాత్ముడుఁ బతితకల్మషదూరుడు. లేఁడు; నాకు వి
ద్వన్నుత: నీవె జీవనము. దాశరథీ! కరుణాపయోనిధీ! 39

భా॥ ఓరామా! భూమిలో నాకంటె పాపాత్ములులేరు. కాని నీకంటె కరుణాసముద్రులు లేరను కారణముచే 'నీవే దిక్కు' అని నమ్మియుంటిని. నేను నిశ్చయముగా జెప్పుచున్నాను వినుము. అభయమిమ్ము. నాపాపములు వెంటనే నీనామముచే దహించి నాదృష్టిని నీపాదములవెంబడి పైకి నడిచి పరిపూర్ణమున జేరునట్లు నన్ననుగ్రహింపుము.

40, 41 అవతారిక:—ఇచ్చట సాధకునకు పాదదర్శనము లభించి, అంతర్ముఖముగా బైకి తనదృష్టిని నడపుటలో ఏకాగ్రత ఆవశ్యకము. ఆకారణముచే నిదివరలో "సిరులిడ

సీత" యను పద్యమున భగవంతుని వివిధరూపములుగా నేర్పాటు చేసుకొనిన రక్షను 'పెంపనుద' అను దాసిచే ఏక ముఖమునుచేసి తన్ను కాపాడ నియమించుకొనుచున్నాడు.

పెంపను దల్లివై, కలుషబృందసమాగమ మొందకుండర
క్షింపను దండ్రివై, మెయిపసించు దశేంద్రియరోగముల్ నివా
రింపను వెజ్జువై, కృపగురించి పరంబు దిరంబుగాగన
త్సంపదలీయ నీవెగతి, దాశరథీ! కరుణాపయోనిధీ! 40

భా॥ ఓరామా! నేను ప్రకృతిసంబంధముచే పుట్టబడి ప్రకృతిచే బంధింపబడి యున్నాను. ఈప్రకృతి నానిశ్చలధ్యానమున కంతరాయమును కలిగించుచున్నది. కావున నీయందలి వివిధరూపములతో నుండు వివిధశక్తుల నేకమునుజేసి నన్ను రక్షింపుము.

కుక్షినజాండపంక్తు లొనగూర్చి, చరాచరజంతుకోటి సం
రక్షణసేయుతండ్రివి పరంపర నీతనయుండనైననా
పక్షము నీవుకావలదె, పామరుడన్ గరుణించుయోజగ
ద్రక్షక! కర్తవీవెకద; దాశరథీ! కరుణాపయోనిధీ. 41

భా॥ ఓరామా! నేను పయివాడనా! బ్రహ్మాండకోటు లెల్ల నీకుక్షినే కలవుకదా? నన్ను నిరాదరణసేయుట న్యాయమా? నీవేదిక్కనియున్న నన్ను కాపాడుము.

42-47 అవతారిక:—సాధకుడు పాదదర్శనమును పొంది పూర్ణదర్శనమునకై అంతర్ముఖముగా పైకి నడపుటలో నిచ్చట పొందు కష్టమునకు మేరయుండదు. పైస్థానమునకు

బోవు కాలదిని భూతపిశాచాదిగ్రహముల బాధ ఎక్కువగుచుం డును. ఇచ్చట ఆనందమునకును ఆయాసమునకును మేరయుం డదు. గాని స్థిరమగుశాంతి యుండదు. క్రిందకు దిగ మన స్సొప్పదు. పైస్థానము లభింపదు. ఈపరిస్థితిలోని భక్తుని మొఱ్ఱకు అంతము ఉండదు.

గద్దరియోగి హృత్కమలగంధ రసానుభవంబుజెందు పె
న్నిద్దపుగండుతేటి. ధరణీసుతకౌగిట పంజరంబునన్
ముద్దులుగుల్కు రాచిలుక. ముక్తినిదానము. రామ ! రాగదే
తద్దయునేడు నాకడకు. దాశరథీ ! కరుణాపయోనిధీ ! 42

భా॥ ఓరామా ! యోగిపుంగవులు నిన్ను హృదయ కమలమున గనినవారయి దృఢచిత్తంబున వాయుభక్షణ, పర్ణ భక్షణులయి దుర్గమారణ్యములనుండియును స్వర్గలోకసుఖం బును అనుభవించుచున్నారు. మూలప్రకృతియగు సీత నిన్ను కౌగలించుకొని తాను తనభక్తుల నీముఖంబునకు ద్రిప్పి యానందింపజేయుచున్నది. అట్లనే నన్ననుగ్రహించి ఆనందింప చేయుము.

కలియుగమర్త్యకోటి నిను గన్గొనరాని విధంబొ! లేక వ
త్సలతొ వహింపవో ! చటుల సాంద్రవిపద్దశవార్ధి గ్రుంకుచో
బిలిచిన బల్కు. వింతమరపే ! నరుడిట్లనరాదు గాక ; నీ
తలపునలేదె సీత చెఱ; దాశరథీ ! కరుణాపయోనిధీ ! 43

భా॥ ఓరామా ! నేను ఎంత వేడినను నాహృదయ కమలమందు నీశుద్ధతేజోరూపమును గనుబరచవు. నేచేయు

సాధకమున లోపము లుండవచ్చును. నీవు భక్తవత్సలుడవు కావా ? నీకృపలేక ఎంతని నేనీమార్గము ననుసరింపగలను. నాయెడగల మూలప్రకృతిని బాహ్యప్రకృతిని నీనుండి విడదీసి నన్ను దుఃఖసముద్రమున ముంచుచున్నది. దాని బాధ ఎట్టిదియో నీవు రావణునివలన అనుభవించితివికదా ? ఇంతేగాక నాయెడ మరచుట ధర్మమా ?

జనవర : మీకథాళి వినన్వైపక కర్ణములందు ఘంటికా
వినదవినోదముల్సలుపు నీచునకున్ వరమిచ్చినావు : ని
న్ననయము నమ్మి గొల్చిన మహాత్ములకేమి యొసంగెదో : సనం
దనసుత : మాకొసంగుమయ. దాశరథీ : కరుణాపయోనిధీ : 44

భా॥ ఓరామా! నేను నీకృపకు పాత్రుడ గానంటివేమో! నీపేరైనను వినరాదని చెవులకు గంటలను కట్టుకొనిన ఘంటాకర్ణుడను నీచునకు వరమిచ్చి రక్షించితివే. నావలన నెన్ని లోపములున్నను నమ్మియుండుటలో లోపము లేదుకదా. అట్టి నన్ను కాపాడకుండుటకు కారణమేమి ?

పాపము లొందువేళ, రణపన్నగభూమి భయాజ్వరాదులం
దాపదనొందువేళ, భరతాగ్రజ : మిమ్ము భజించువారికిన్
బ్రాపుగనీవు. దమ్మ డిరుపంక్తులనున్ జని, తద్విపత్తిసం
తాపము గూల్చి కాతురట; దాశరథీ : కరుణాపయోనిధీ : 45

భా॥ ఓరామా! నీభక్తులకు నెవరివలన నెట్టిలోపములు సంభవింపనున్నను ప్రజ్ఞానమగు నీవును విజ్ఞానరూపుడగు

నీసోదరుడగు లక్ష్మణుడును రెండువైపులనుండి కాపాడెదరట. ఇది సత్యముకాదా! వేగముగా నన్ను కాపాడరాదా!

అగణితజన్మకర్మ దురితాంబుధిలో బహుదుఃఖవీచికల్
దెగిపడి నీదలేక జగతీధవ! నీపదభక్తి నావచే
దగిలి తరింపగోరితి, పదంపడి నాదుభయంబు దీర్పవే!
తగనని చిక్కులన్నిడక దాశరథీ! కరుణాపయోనిధీ! 46

భా॥ ఓరామా! నన్నావరించియున్న యజ్ఞానము నాచే మితిమీరిన దుష్కార్యముల జేయించి నన్ను జన్మపరంపరలచే దుఃఖసముద్రమున ముంచదలచుచున్నది. దీనిని దాటి దరిజేర నాకు శక్యము కాకున్నది. దీనిని భరించలేకుంటిని. నిరంతరమును నీయందే నామనస్సుండునట్లుచేసి నన్ను తరింపచేయుము.

నేనొనరించు పాపము లనేకములైనను నాదుజిహ్వకున్
బానకమయ్యె మీపరమపావననామము, దొంటిచిల్క "రా
మా! ననుగావు" మన్న తుదిమాటకు సద్గతిజెందె. కావునన్
దాని ధరింపగోరెదను దాశరథీ! కరుణాపయోనిధీ! 47

భా॥ ఓరామా! నేను జేసిన పాపములనేకములు కలవు. అయినను నీనామమును అగ్నికణమున కవియన్నియును దూది కుప్పవంటివి. పూర్వపు జ్ఞానహీనయగు చిలుక రామా! నను గావుము. అని వేడినంతనే సద్గతి నిచ్చితివికదా.

48, 49, 50 అవతారిక :—ఈసమయమున సాధకునకు కామక్రోధములు విజృంభించును. ఇవి మూలతేజస్సునకు సన్నిహితముగానుండి సాధకుని తమవైపునకు లాగుకొన

జూచును. ఈసమయముననే సాధకులు కామక్రోధములకు లోనయి భ్రష్టులయ్యేదరు. పరిపూర్ణు లీకామక్రోధముల విడదీసి లోకసంగ్రహమునకై వినియోగించెదరు. ఉ:—పరాశుడు, వ్యాసుడు మొదలగువారు. ఇట్టి సమయముననే గోపికలు "కట్టాతిలమునుకలునై, దట్టపువిరహాగ్ని తెరలు తరుణులనేచన్, ఎట్టుల బరిమార్చెదనో, కట్టడినిక రాకుమార! కరుణోదారా" యని శ్రీకృష్ణుని ప్రార్థించిరి. దీనినే శ్రీకృష్ణుడర్జునునకు "కామ రూపమ్ శత్రుంజహి" యనియును, "కామఏషక్రోధ ఏష రజోగుణ సముద్భవః" అనియును బోధించెను.

పరధనముల్హరించి, పరభామలనంటి, పరాన్నమబ్బినన్
మురిపెమగాని, మీదనగు మోసమెరుంగదు మానసంబు, దు
స్తరమిది, కాలకింకరపరాహతి బాల్పడ నీక నన్ను నే
తరి దరిజేర్చి గాచెదవొ? దాశరథీ కరుణాపయోనిధీ! 48

భా॥ ఓ రామా! నీ నామమును నిరంతరధారగా ధ్యానించుచుండగా నాయందలి కామరూపయగు శత్రువు ఇదియే సమయమని విజృంభించి నన్నధోగతిపాలు చేయ చూచుచున్నది, దీనినుండి తప్పించుకొన నాకు శక్యము కాదు. నీవే కాపాడవలయును. లేకున్న నే నధోగతిపాలగుదును. కావున రామా పరాకుమాని గోపికలను కాపాడినట్లు నన్ననుగ్రహింపుము.

చేసితి ఘోరకృత్యములు, జేసితి భాగవతాపచారముల్,
జేసితి నన్యదైవముల జేరి భజించిన వారిపొందు, నే

జేసిన నేరముల్మరచి చిక్కుల బెట్టకుమయ్య! యయ్య! నీ
దాసుడనయ్య! భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ! 49

భా॥ ఓ రామా! ఇప్పుడు నే చేయుచున్న నీ ధ్యాన యజ్ఞములో నీవే మాత్ర మేమరియున్నను నా యింద్రియములు విజృంభించి నన్నధోగతిపాలు చేయును. నేజేసిన నేరములున్న మరచి రక్షింపుము. నన్నుకాపాడ నిదియే సమయము. చిక్కులలో బెట్టకుము.

పరులధనంబు జూచి, పరభామల జూచి, హరింపగోరు మ
ద్గురు తరమానసంబనెడి దొంగనుబట్టి. నియాథదాస్య వి
స్ఫురిత వివేకపాశముల జుట్టి, భవచ్చరణంబనే మరు
త్తరువున గట్టివేయగదె దాశరథీ కరుణాపయోనిధీ! 50

భా॥ ఓ రామా! ప్రాపంచిక సుఖముల మరచి నిన్నే పరమావధిగా ధ్యానించుచున్న నా మానసమును కాంతాకనకములందలి వాంఛ తమవైపునకు లాగుకొని చిక్కులలో బెట్ట చూచుచున్నది. వాటిని జయింప నాకు శక్యము కాదు. నీవు నాయందు కృపనుంచి నా మనస్సు నీ పాదముల విడచిపోకుండునట్లు నన్ననుగ్రహింపుము.

51—53 అవతారిక :— పై పరిస్థితిలో విజృంభించిన కామాదులకు మూలమగు 'సూక్ష్మనాడిని' నశింపజేయ భగవంతుడుతక్క వేరె దిక్కులేదని ప్రార్థించుచున్నాడు.

సలిలత రామనామజప సారమెరుంగను గాశికాపురీ
నిలయుడగాను, మీ చరణ నీరజరేణు మహాప్రభావమున్

దెలియ నహల్యగాను. జగతీధవనీదగు సత్యవాక్యముల్
దలపగ రావణాసురుని దమ్ముడగాను భవద్విలాసముల్
దలచి నుతింప నాతరమె దాశరథీ కరుణాపయోనిధీ! 51

భా॥ ఓరామా! నేను మహావిపత్సమయమున నైనను చలించక నుండుటకు శంకరుడు, అహల్య, విభీషణుడు మొదలగు వారివలె దృఢమైనవాడను గాను. నీ విలాసచే నన్ను న్య చింతలేనివానిగా జేయుము.

పాతకులైన మీ కృపకు బాత్రులుగారె తలంచి చూడ. చ
ట్రాతికిగల్గె స్త్రీత్వము. నరాతికి రాజ్యసుఖంబు గల్గె. దు
ర్జాతికి బుణ్యపుబ్బె గపిజాతి మహత్త్వమునొందె గావునన్
దాతవయెట్టి వారలకు దాశరథీ కరుణాపయోనిధీ! 25

భా॥ ఓరామా! నేను పాతకుండను, నీ మహద్విలాసమును నాకెట్లు గనుపరచెదనంటివేమో! నా కంటెను మహా పాతకుల కెందరికి నీ మహాత్మ్యమును గనుబరచి యనుగ్రహించలేదు? కావున నా ప్రార్థనను విని నన్ననుగ్రహింపుము.

మామక పాతకవ్రజము మాన్పనగణ్యము చిత్రగుప్తులే
మేమనిప్రాతురో! శమనుడేమి విధించునో! కాలకింకర
స్తోమ మొనర్చునేమొ! వినజొప్పడ. దింతకు మున్నెదీన చిం
తామణి! యెట్లుగాచెదవొ. దాశరథీ కరుణాపయోనిధీ! 53

54, 55 అ వ తా రి క :—ఇట్లెంత వేడినను సాధకునకు పైస్థానమందదు. ఆయాస మధికమాయెను. అంత భక్తుడు భగవంతుని నెత్తి పొడుచుచున్నాడు.

దాచినచుట్టమా శబరి దాని దయామతి నేలినావు. నీ
దాసుని దాసుడా గుహుడు తావకదాస్యము సంగినావు నే
జేసినపాపమా వినుతిజేసిన కావవు. కావుమయ్య నీ
దాసులలోన నేనొకడ దాశరథీ ! కరుణాపయోనిధీ ! 54

భా॥ ఓరామా ! ఆర్తరక్షామణీ ! నీకింత పక్షపాత మేల ? గుహుడు, శబరి మొదలగువారి నెట్లు గాచితివి. నేను నీదాసుడగానా ? నన్నిట్లు బాధించుట న్యాయమా ?

దీక్షవహించినా కొలది దీనుల నెందరిగాచితో, జగ
ద్రక్షక ! మున్ను నాద్రుపదరాజతనూజ దలంచినంతనే
యక్షయమైన వల్వలిడి, తక్కటి నామొరలాలకించి ప్ర
త్యక్షము గావదేమిటికి ? దాశరథీ ! కరుణాపయోనిధీ ! 55

భా॥ ఓరామా ! నీలమేఘచ్ఛాయగల నీరూపమును చూడదలచి యెన్నివిధముల ప్రార్థించినను నీకు దయరాలేదు. ఆగజేంద్రుని, ద్రౌపదిని, ప్రహ్లాదుని ఎట్లు కాపాడితివి ? దీన పరాయణుడవను బిరుదు పొందితివి. నాకు ప్రత్యక్షము కానుం డుటకు కారణంబేమి ?

56 అవతారిక :—ఇట్లు భక్తుడు పూర్ణవిగ్రహదర్శన మునకై పరితపించుచుండగా రూపముకంటె నామమునం దెక్కువ ప్రభావము కలదను జ్ఞానము కలిగి "నీరూపమును దాచుకొనిన దాచుకొనుము. దానికంటెను మహాప్రభావముగల నీనామము కలదు. దాని నెవ్వరు దాచుకొనగలవు" అని నామధ్యానమును చేయ నిశ్చయించుకొనును.

నీలఘనాభమూర్తివగు నిన్ను గనుంగొన గోరి వేడినన్
జాలముజేసి దాగెదవు, సంస్తుతికెక్కిన రామనామమే
మూలను దాచుకోగలవు ? ముక్తికి బ్రాపది, పాపమూలకు
ద్దాలము కాదె మాయెడల, దాశరథీ కరుణాపయోనిధీ ! 56

భా॥ ఓరామా ! నీలమేఘచ్ఛాయగల నీ రూపమును జూడదలంచి యెన్నివిధముల ప్రార్థించినను నీకు దయరాలేదు. భక్తులకొఱకు కల్పింపబడినది గాని నిజముగా నీకు రూపము గలదా ? నీ రూపముకంటె నీ నామమెక్కువశక్తియును మాధుర్యమును గలది. దాని నెచ్చటదాచుకొందువు ?

57—63 అవతారిక :—ఈ సమయమున సాధకుని ప్రారబ్ధము చాల అల్లరిని పెట్టును. ప్రపంచమంతయును శతృత్వమును వహించును. అదివరలో గల పరమ మిత్రులు సహితము శత్రులయ్యెదరు. తాను చూపిన తెలుపు నలుపుగాను, నలుపు తెలుపుగాను లోకమునకు గనుపించును. తానెంత ప్రేమించుచున్నను విరసనముగానే చూడబడును. అంత భక్తునకు తన్ను రక్షించువాడొక్కడే యనియును, ఇతర బంధుమిత్రులు ఋణానుబంధులనియును భగవంతుడొక్కడే నిజమగు బంధువనియును, వీరలయెడల ప్రేమ వీరివలన పొందు మేలు జన్మపరంపరలకే కారణమనియును దెలిసి ఇట్టి సంపర్కము లేకుండను వారి బాధలు కలుగకుండను నిశ్చలచిత్తునిగా చేయుమని ప్రార్థించుచున్నాడు.

వలదుపరాకు. భక్తజనవత్సల నీ చరితంబు వమ్ముగా
వలదు. పరాకు. నీ బిరుదు వజ్రమువంటిది. కానకూరకే
వలదు. పరాకు. నా దురిత వార్ధికి చెప్పవుగా మనం
బులో దలతుమెకా ! నిరంతరము దాశరథీ కరుణాపయోనిధీ ! 57

భా॥ ఓరామా ! అశ్రద్ధవలదు. నీచరిత్రను వృథాచేసి కొనకుము. నీసామర్థ్యమును నే నెరుంగనివాడగాను. అది వజ్రమువలె నభేద్యమయినది. నేను దాసిని చేపట్టితిని. ఈసంసార సముద్రము గొప్ప మొసళ్లతో కూడినది. నీయెడగల భక్తి యను నావచే దానిని దాటెదను. కావున పరాకుగా నుండక నన్ను కాపాడుము. నేను నిన్ను వదలువాడకాను.

తప్పులెరుంగలేక దురితంబులు చేసితినంటి, నీవు మా
యప్పవు. గావుమంటి, నిక నన్యులకున్నదురంటనంటి. నీ
కొప్పెదమైన దాసజను లొప్పినబంటకు బంటునంటి. నా
తప్పులకెల్ల నీవెగతి దాశరథీ ! కరుణాపయోనిధీ ! 58

భా॥ ఓరామా ! నే ననేకములగు తప్పులజేసితిని. నీవే తండ్రివని నమ్మి యుంటిని. నీళ్లముంచినను పాలముంచినను నీవేగతి. ఇతరు లెంతవారైనను వారిని జేరను. కావున పరాకు మాని కాపాడుము.

ఇతడు దురాత్ముడంచు జనులెన్నగ నారడికెక్కె నేనెపో
పతితుడనంటి నోపతితపావనమూర్తివి నీవుగల్గ నే
నితరుల వేడనంటి నిహమిచ్చిన నిమ్ము పరంబొసంగుమీ
యతులితరామనామ మధురాక్షరపాళి నిరంతరంబు హృ
ద్గతమని నమ్మి గొల్చెదను దాశరథీ కరుణాపయోనిధీ ! 59

భా॥ ఓరామా! నీరూపము నాకవసరములేదు. మిగుల మాధుర్యమగు నీనామము నెల్లప్పుడును నాహృదయమున నిల్చి యుండునట్లు నన్ననుగ్రహింపుము. పరమపావనమూర్తివి నీవుండ నితరుల సేవను నేచేయజాలను. ఇహమిచ్చుటకు వీలు లేకున్న పరము మాత్ర మీయక తప్పదు.

అంచితమైన నీదు కరుణామృతసారము నాదుపైన బ్రో
క్షించినజాలు. దాన నిరసించెద నాదురితంబులెల్ల. దూ
లించెదవైరివర్గ. మెదలించెద గోర్కెల నీదుబంటనై
దలచెద గాలకింకరుల. దాశరథీ కరుణాపయోనిధీ! 60

భా॥ ఓరామా! నాకై నీ వితరులతో విరోధపడవలయు ననుకొంటివేమో? నీ కట్టి శ్రమయును నిందయును అవసరము లేదు. నీ దయను నాయందుంచిన నెట్టి భయంకర దుష్టుల నైనను సంహరించెద. నీ శక్తిని నాపై ప్రసరింపజేయుము.

జలనిధులేడు నొక్క మొగిచక్కికిదెచ్చె శరంబు. రాతినిం
పలరగజేసె నాతిగ పదాబ్జపరాగము. నీ చరిత్రము
న్జలజభవాది నిర్జరులు సన్నుతిసేయగలేరు గావునన్
దలపనగణ్యమయ్య నిది దాశరథీ కరుణాపయోనిధీ! 61

భా॥ ఓరామా! నీకుగల మహాశక్తి నాకు దెలియనిది కాదు. నీ బాణశక్తి సముద్రము నింకించెను. నీ పాదశక్తి రాతిని నాతిగా జేసెను. నీ శక్తిని జూచి బ్రహ్మరుద్రాదులచ్చెరువందు చున్నారు. కావున నీ శక్తి లెక్కించవీలు లేదు.

కోతికిశక్యమా అసురకోటుల గెల్వను! గెల్చెబో, నిజం
బాతనమేను సీతకరుడౌట దవానలు, డెట్టివింత! మా

సీత పతివ్రతామహిమ సేవకు భాగ్యము మీ కటాక్షముల్,
దాతకు శక్యమా పొగడ, దాశరథీ కరుణాపయోనిధీ ! 62

భా॥ ఓరామా! ఇకనీభక్తులనన్ననో, వారిని నీతో సమానులగు శక్తులు గలవారిగా జేయుదువు. లేనియెడల కోతి సముద్రమును దాటుట, కొండలు నీటిపై తేలుట యెట్టిపింత. నిన్ను ఆదరించియున్న మూలప్రకృతియగు సీతయో. ఆమె దయార్ద్రదృష్టి యగ్నిహోత్రుని చంద్రునివలె చేయలేదా. కావున నీశక్తిని నాపై ప్రసరింప జేసి యీ ప్రకృతి భూతములు నన్ను బాధింపకుండ కాపాడుకొనగలను. నీ భక్తులకు శక్యము కానిదేమున్నది ?

భూపలలామరామ ! రఘుపుంగవరామ ! త్రిలోకరాజ్యసం
స్థాపనరామ ! మోక్షఫలదాయక రామ ! మదీయపాపము
ల్బాపగదయ్య ! రామ ! నిను బ్రస్తుతిజేసెదనయ్య ! రామ ! సీ
తాపతిరామ ! భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ ! 63

భా॥ ఓరామా ! మూడులోకములందును ధర్మమును స్థాపించు పరిపాలకుడవీవే. నీ అంశ లేనిదే ఏ రాజును ధర్మముగా పాలించలేడు. అట్టివో నీవు పరిపూర్ణుడవై వెలుగొందిన నెట్టి అధర్మములైనను నశించకుండునా ? కావున నా శత్రువుల శిక్షించి నన్ననుగ్రహింపుము.

64—65 అవతారిక :— ఇప్పటికి సాధకునకు ఇహ సంబంధమగు భయములు నశించి భగవంతుని విశ్వరూపునిగా

భావించి ప్రార్థించుచున్నాడు. ఇదియే రెండవ అంతరువులో కృష్ణతత్వము.

నీ సహజంబు సాత్త్వికము, నీ విడిపట్టు సుధాపయోధి ప
ద్మాసనుడాత్మజుండు కమలాలయ నీ ప్రియురాలు నీకు సిం
హాసన మీధరిత్రి గొడుగాకస మక్షులు చంద్రభాస్కరు
ల్నీ సుఖతల్ప మాదిఫణి నీపెనుపంటము గొల్చినట్టి నీ
దాసుల భాగ్యమెట్టిదయ దాశరథీ కరుణాపయోనిధీ! 64

భా॥ ఓరామా! నీవు సర్వసంపూర్ణుడవు. సమస్త దైవములును నీ అంశములోనివారే. నిన్ను విడచి ఏదియునులేదు. అట్టి పరిపూర్ణుడవగుటచే నిన్ను గొలిచిన భక్తులకు పరిపూర్ణమే సిద్ధించును.

చరణము సోకినట్టి శిలజవ్వని రూపగుటొక్క వింత, సు
స్థిరముగ నీటిపైగిరులు దేలిన దొక్కటివింత, గాన మీ
స్మరణదనర్పు మానవులు సద్గతిజెంది నదెంత వింతయీ
ధరను? ధరాత్మజారమణ! దాశరథీ కరుణాపయోనిధీ! 65

భా॥ పరిపూర్ణుడవైన ఓరామా! నీ సంబంధముచే నిర్జీవ పదార్థమగు రాయి జవ్వని యాయెను. కొండలు నీటిపై తేలినవి. అట్టిచో నీదృష్టిలోనున్న యుత్కృష్టజన్మగల మానవుడు నిన్ను చేపట్టి సద్గతినొందుట యాశ్చర్యమా?

66—68 అవతారిక: — ఇప్పటికి సాధకునకు కొన్ని సిద్ధులు కలుగును. గాని యుచ్ఛిష్టభూతములు విఘ్నము చేయుటకయి యనేక విధముల మనోవికారముల కలిగించును. లోక

ములో శత్రుత్వమును వృద్ధిచేయును. భరించరాని చిక్కులలో బెట్టును. ఇందు 66, 67, 68 పద్యములందు భగవంతుని నాకిహాభోగములవసరములేదు. నన్ను పరమును చేరనీయక బాధించు రాక్షసుల గూర్చిన చాలును. పరోపకారమునకు మించిన సత్కార్యములేదని భగవంతుని ప్రార్థించి దశేంద్రియంబులంకును దశముఖములుగా ప్రవేశించి రాక్షసుల సంహరించదాల్చిన దశావతారముల ప్రయోగించి శత్రుసంహారమును జేయుచున్నాడు. ఇదియే భక్తుని మూడవ అంతరువుసిద్ధి. ఇదియే కంసవధ.

దైవము. తల్లిదండ్రి. తగుదాత. గురుండు. సఖుండు నిన్నెగా
భావనచేయుచున్నతరి బాపములెల్ల మనోవికారదు
ర్భావితుజేయుచున్నవి దయామతివై కృపజూడుమీ
జగత్పావనమూర్తి భద్రగిరి దాశరథీ। కరుణాపయోనిధీ। 66

భా॥ ఓరామా! నీవేదైవము, తల్లిదండ్రియును. నిశ్చల బుద్ధిచే ధ్యానము చేయుచుండగా అదివరలోని నా పూర్వజన్మ వాసనలు నా మనస్సును కలతపరచుచున్నవి. కావున ఓరామా! వానిని సంహరించి నన్ను కాపాడుము.

వాసవరాజ్యభోగసుఖవార్ధినిదేలు ప్రభుత్వ మబ్బినా
యాసకు మేరలేదు కనకాద్రి సమానధనమ్ముగూర్చి న
న్నాసునువెంటరాదు కని కానకజేసిన పుణ్యపాపము
ల్వీసరపోవ నీవు పదివేలకు జాలు భవంబునొల్ల నీ
దాసునిగాగ నేలుకొను దాశరథీ। కరుణాపయోనిధీ। 67

భా॥ ఓరామా! నాకుగల యాశాపిశాచము ఇంద్ర భోగము లభించినను సంతుష్టిని పడునదికాదు. ఈ ధనమును భార్యాపిల్ల లేవియును వెంటరావు. కావున నాకీ ప్రకృతి మహిమలందిచ్ఛలేదు. కావున నా మనస్సును కలతనొందించు రాక్షసుల సంహరించుము.

సూరిజనుల్దయాపరులు, సూనృతవాదులు, బద్ధమానవు
ల్వీరపతివ్రతాంగనలు, విప్రులు, గోవులు, వేదముల్మహీ
భారముదాల్పగా జనులు పావనమైన పరోపకార స
త్కార మెరుంగలే రకట, దాశరథీ! కరుణాపయోనిధీ! 68

భా॥ హేరామా! ప్రపంచరీతి యెట్లున్నదో చూచి తివా! పండితులు, సత్యసంధులు, పతివ్రతలు, బ్రాహ్మణులు, గోవులు, వేదములు మొదలగునవన్నియును నీ అంశగలవై ప్రజలను పావనము చేయగలిగియుండగా వానిని చేపట్టి లాభ మును పొందజాలక దుర్మార్గులు వాటికి విఘాతమును కలుగ చేయుచున్నారు. కావున అట్టి దుర్మార్గుల సంహరించి కాపాడుము.

## ద శా వ తా ర ఘ ట్ట ము.

వారి చరావతారమున వారిధిలో జొరబారి క్రోధవి
స్తారగుడైన యానిగమతస్కరవీరనిశాచరేంద్రునిం
జీరి, వధించి, వేదముల జిక్కెడలించి విరించి కిన్మహో
దారతనిచ్చి తీవెకద దాశరథీ! కరుణాపయోనిధీ! 69

భా॥ ఓరామా! సోమకాసురుడు వేదముల హరించి లోకముల జ్ఞానశూన్యముగా చేయు వానిని మత్స్యరూపమున సంహరించితివి. అట్లే నీ ధ్యానమున తత్పరుడనై యున్న నాజ్ఞానమును హరించు అజ్ఞానతిమిరమును సంహరించుము.

కరమనురక్తి మందరము గవ్వముగా. నహిరాజు త్రాడుగా
దొరకొని దేవదానవులు దుగ్ధపయోధి మథింపుచున్నచో
ధరణిచరింప లోకములు తల్లడమందగ గూర్మమై ధరా
ధరము ధరించి తీవెకద దాశరథీ! కరుణాపయోనిధీ! 70

భా॥ ఓరామా! దేవదానవులు ఆదిశేషువు త్రాడుగా మందరము కవ్వముగా పాలసముద్రమును అమృతముకై తరచుచుండగా, నా మందర పర్వతము మునిగిపోగా కూర్మరూపమున దానిని పైకెత్తితివి. ఆరీతినే నేను నీ నిర్మలరూప సుధారసమును ద్రావ నిన్ను ధ్యానించుచుండగా కామాది మనోవికారములు నా బుద్ధి నధో మార్గమునకు లాగుచున్నవి. అట్లు కాకుండ పైకి లేవదీసి రక్షింపుము.

ధారుణి జాపజుట్టిన విధంబున గైకొని హేతునేత్రుడ
వ్వారిధిలోన డాగినను వాని వధించి వరాహమూర్తివై
ధారుణి దొంటికైవడిని దక్షిణశృంగమునన్ ధరించి వి
స్తార మొనర్చితీవెకద దాశరథీ కరుణాపయోనిధీ! 71

భా॥ ఓరామా! ఆశాపిశాచియగు హిరణ్యాక్షుడు భూమినంతను చాపచుట్టవలె చుట్టి సముద్రములో దాగుకొనగా పందిరూపమును ధరించి, యా రాక్షసుని సంహరించి, భూమిని

గ్రొమ్ముతో పైకి నెత్తి, లోకముల రక్షించితివి. నాకుగల యాశాపిశాచము నన్ను నీ దర్శనమునకు పైకి రాకుండ అధో గతిపాలు చేయుచున్నది. కావున దానిని సంహరించి నన్ను కాపాడుము.

పెటపెట ముక్కు కంబమున భీకరదంత నఖాంకురప్రభా
పటలముగప్పు నుప్పతిల ఖండనవీధి నృసింహభీకర స్ఫుర
పటుశక్తి హేమకశిపు న్విదళించి సురారిపట్టి నం
తట గృపజూచి తీవెకద దాశరథీ ! కరుణాపయోధీ ! 72

భా॥ ఓరామా ! పూర్వము హిరణ్యకశిపుడను రాక్షసుడు ముల్లోకములకు తానే ప్రభువునను గర్వముతో నీ భక్తులను హింసించుచుండ నరసింహ రూపమున వారిని సంహరించితివి. ఆరీతిగా నహంకారపూరితమగు నా శత్రువులు నీపై ధ్యానమును నిలువనీయక బాధించుచున్నారు. కావున వారిని సంహరించి నన్ను నిరంతరము నీపదధ్యానముగల వానిగా చేయుము.

పదయుగళంబు భూగగన భాగముల న్వెసనూని విక్రమా
స్పదమగు నబ్బలీంద్రు నొకపాదము నన్దలక్రింద నొత్తి మే
లొదవ జగత్త్రయంబు బురుహూతునకీయ వటుండవైన చి
త్పదముల మూర్తి వీవెకద దాశరథీ ! కరుణాపయోనిధీ ! 73

భా॥ ఓరామా ! మూడులోకములలోను నా కంటెను అధికుడు లేడని గర్వించు బలీంద్రుని మూడులోకములును నీ మూడు పాదములకును సాటిరావని పాతాళలోకమునకు ద్రొక్కి లోకముల నుద్ధరించితివి.

నా శత్రువులు నేను నీయందు బుద్ధినినిగుడ్చి నిశ్చలానందముతో నుండుటను సహించలేక నా ధ్యానమునకు కీడును కలిగించుచున్నారు. అట్టివారిని సంహరించి నన్ననుగ్రహింపుము.

ఇరువదియొక్కమారు ధరణీశుల నెల్ల వధించి తత్కళే
బర రుధిరప్రవాహమున బైతృకతర్పణ మొప్పజేసి భూ
సురవరకోటికిన్ముదము సొప్పడ భార్గవరామమూర్తివై
ధరణినొసంగితీవెకద దాశరథీ కరుణాపయోనిధీ! 74

భా॥ క్షత్రియులు కేవలము అహంకార మమకారములకు లోనయి బ్రాహ్మణుల నిర్లక్ష్యము చేయగా వారల నందరను ఇరువదియొక్కసారి సంహరించితివి. నీ ధ్యానమున కంతరాయమును గలిగించు నా బాహ్యాభ్యంతర రాజసముల సంహరించి నా యింద్రియములు పెడత్రోవను బోకుండ కాపాడుము.

దురమున దాటకిన్దునిమి ధూర్జటివిల్దునుమాడి సీతనున్
బరిణయమంది తండ్రి పనుపన్ ఘనకానన సీమకేగి దు
స్తరపటుచండ కాండకులిశాహతి రావణ కుంభకర్ణ భూ
ధరముల గూల్చితీవెకద దాశరథీ కరుణాపయోనిధీ! 75

భా॥ ఓరామా! లోకములో కొందరు కర్మబాహ్యులయి కర్మకాండల జేయువారిని తాటకి మారీచులవలె బాధించుచున్నారు. కొందరు భోగలాలసులయి అహంకార మమకారముల పూర్ణులయి నీ భక్తుల రావణ కుంభకర్ణులవలె బాధించుచున్నారు. కావున నట్టివారిని సంహరించి కాపాడుము.

అనుపమయాదవాన్వయ సుధాబ్ధి సుధానిధి కృష్ణమూర్తి నీ
కనుజుడుగా జనించి-కుజనావళి నెల్లనణంచి రోహిణీ

తనయుడనంగ బాహుబలదర్పమునన్ బలరామమూర్తిపై
తనరినవేల్పు వీవెకద దాశరథీ కరుణాపయోనిధీ! 76

భా॥ దేవుడు లేడనియును ఇహమేగాని పరము లేదని నియును మానుషశక్తియే మహాశక్తియని గర్వించుచు నిరంతరమును నీ పాదసేవామృతమును గ్రోలు యోగుల హింసించు కంసాదుల సంహరించిన యో కృష్ణా నన్ననుగ్రహించి నాచిత్తమెల్లప్పుడును నీ పరిపూర్ణస్థానమునకు బోయి నిలుచునట్లు నన్ననుగ్రహింపుము.

సురలు నుతింపగా త్రిపురసుందరుల వ్రతమాన్పగ బుద్ధరూ
పరయగ దాల్చితీవు త్రిపురాసుర కోటి దహించునప్పుడా
హరునకు దోడుగా శరశరాసన బాణముఖోగ్రసాధనో
త్కర మొనరించితీవెకద దాశరథీ కరుణాపయోనిధీ! 77

భా॥ ఓ రామా! త్రిపురాసురులు ప్రకృతిని స్వాధీనపరచుకొనినవారయి లోకకంటకులుకాగా బుద్ధావతారమున వారల కర్మకాండలయందు విముఖులయి శుష్క వేదాంతులగునట్లొనర్చితివి. కొందరు సమస్తభోగములను గలవారయి నీ యందుదగిలి ధ్యానించు భక్తుల హింసించుచున్నారు. అట్టివారి వధించి రక్షింపుము.

సంకరదుర్గమై దురితసంకులమైన జగంబు జూచి స
ర్వంకషలీల నుత్తమతురంగము నెక్కి కరాసిబూనిన
రాంక విలాసమొప్ప గలికాకృతి సజ్జనకోటికి నిరా
టంక మొనర్చితీవెకద దాశరథీ కరుణాపయోనిధీ! 78

భా॥ ఓరామా! యీ కలికాలమున జనులు వర్ణాశ్రమ ధర్మముల విడచినవారయి నాస్తికులయి నీ భక్తుల హింసించుచున్నారు. నీవు కలికాకృతిని వారల సంహరించెదనంటివిక దా నా శత్రువులు నన్ను పెట్టుచున్న బాధలను అంతవరకు భరించ లేను. కావున నీవు కోదండరాముడవయి వారల సంహరించి నన్ను కాపాడుము.

79—80 అవతారిక :— ఇట్లు దశావతారములచే శత్రు సంహారము కాగా నానందమగ్నుడయి భగవంతుని మహిమ కచ్చెరువందుచు పొగడుచున్నాడు.

ముదమున కాటపట్టు, భవమోహమదద్విరదాంకుశంబు, సం
పదల కొటారు, కోరికలపంట, పరంబునకాది పైరులన్
కదనజయించు త్రోవ, విపదబ్ధికి నావగదా సదాభవ
త్పదమల నామసంస్మరణ దాశరథీ కరుణాపయోనిధీ! 79

భా॥ ఓరామా! ఏమినీనామమహిమ. ఏమి నీ భక్త వత్సలత. ఏమి నీ సామర్థ్యము. ఏమి నీ పరాక్రమము. ఎంతలో నాశత్రువుల సంహరించితివి.

దురితలతానుసారి భవదుఃఖకదంబము రామనామ భీ
కరతరహేతిచేతెగి చకాచకలై జనకుండ నేర్చునే
దరికొని మండుచుండు శిఖిదార్చినినన్ శలభాది కీటకో
త్కరములు లీనమై చనవె దాశరథీ కరుణాపయోనిధీ! 80

భా॥ ఓరామా! అగ్నిలోబడిన కీటకములవలె నీ భక్తుల బాధించు దుష్టులు నశించకుందురా. నీ నామమందుగల భీకర

శక్తిచే ముక్కముక్కలయి నశించనిదేమున్నది? ఓరామా! భక్తమందారమా! నీ దయచే నేను ధన్యుడను.

**81—84 అవతారిక :**—అంత భక్తుడింద్రియజయంబును బొంది శత్రుబాధలు నశింపగా, దిరిగియట్టి ఇంద్రియములు చెడుత్రోవను పోకుండ కాపాడ ప్రార్థించుచున్నాడు.

మనమున నూహాపోహలును మర్వకమున్నె కఫాదిరోగముల్
దనువుననంటి మేనుబిగి దప్పకమున్నె నరుండు మోక్షసా
ధన మొనరింపగావలయు తత్వవిచారము మానియుండుటల్
తనువునకున్ విరోధమిది దాశరథీ కరుణాపయోనిధీ! 81

భా॥ ఓరామా! ఈ దేహము అనిత్యము. జీవుడెప్పుడు విడిచిపోవునో. రోగములు నన్నావరించి నా మతిని చెడనీయకమున్నె నీ సేవను జేసి నీలో చేరునట్లు చేయుము. జన్మపరంపరల బొందజాలను.

హరిపదభక్తి నింద్రియజయాన్వితుడుత్తము. డింద్రియంబులన్
మరువక నిల్వనూదినను మధ్యము. డింద్రియపారవశ్యుడై
పరగినచో నికృష్టుడని పల్కగ దుర్మతినైన నన్ను నా .
దరమున నెట్లు గాచెదవొ దాశరథీ కరుణాపయోనిధీ! 82

భా॥ ఓరామా! ఇంద్రియములు చాల బలముకలవి. నీకృపచే నిప్పుడు స్వాధీనమయినను తిరిగి విజృంభించి నన్నల్లరి పెట్టకుండ కాపాడుము. ఇంద్రియ వ్యాపారములు పూర్తిగా నశింపుగాక నీ పరిపూర్ణానందము సిద్ధించదుకదా! కావున

నీ నిరంతర పదభక్తిచే నా ఇంద్రియములు నీయందే నిలిచి యుండునట్లు నన్ననుగ్రహింపుము.

వనకరిచిక్కెమైన సకువాచవికిన్ జెడిపోయె మీను తా
వినికికి జిక్కె జిల్వకను వేదురుజెందెను సిళ్లతావిలో
మనికి నశించె దేటి తరుమాయిరు మూటినిగెల్వనైను సా
ధనములకెల్ల నీవెగతి దాశరథీ కరుణాపయోనిధీ ! 83

భా॥ ఓరామా ! కామమును, జిహ్వాదోషమును, వినుట, చూచుట, ఆఘ్రాణించుట, యను నీ యైదువృత్తులును జయింప కష్టసాధ్యములు. నీ దయలేక వాని జయింపనెవరితరము. ఇది సాధకుని నధోగతిపాలు చేయును. కావున నీ దోషములు నన్నంటకుండ కాపాడుము.

కరములు మీకు మ్రొక్క విడకన్నులు మిమ్మనె జూడ జిహ్వమీ
స్మరణదనర్పవీనులులసత్కధలన్ వినుచుండ నాసమీ
యఱుతనెబెట్టి పూసరుల కాసగొనన్ బరమార్థసాధనో
త్కర మతిసేయవే కృపను దాశరథీ కరుణాపయోనిధీ ! 84

భా॥ ఓరామా ! నా హస్తములు నీకు నమస్కరించుటచే కామమును, కన్నులు మిమ్మే చూచుచుండుటచే మనోవికారమును, ప్రాపంచిక మోహామును, ఎల్లప్పుడును నీ కథల వినుచుండుటచే ప్రాపంచిక విషయముల దెలసికొనవలయునను కోరికయును, నాలుక యెల్లప్పుడును నీ నామమునే స్మరించుటచే వివిధరుచులపై యిచ్ఛను, మీయందు గల యాశచే

వివిధ విషయములందాశను లేకుండ జేసి నా యింద్రియములు చెడుత్రోవను పోకుండ కాపాడుము.

85—86 అవతారిక :— ఇట్లు సాధకుడు తన ఇంద్రియముల స్వాధీనపరచుకొని తీవ్రవుత్సాహమున పరమేశ్వరుని ధ్యానించుచుండగా ఈశ్వరుని పరిపూర్ణ తేజస్సు కనుబడజూచి యానందించుచున్నాడు. ఇచ్చట సాధకుని యానందమునకు మేరయుండదు. ఇదియే అంతర్ముఖ సూర్య తేజస్సు.

చిరతరభక్తి నొక్క తులసీదళ మర్పణసేయువాడు ఖే
చరగరుడోరగ ప్రముఖసంగములో వెలుగున్ సదాభవ
స్ఫురదరవింద పాదముల బూజలొనర్చిన వారికెల్ల ద
ర్పర మరచేతి ధాత్రిగద దాశరథీ కరుణాపయోనిధీ ! 85

భా॥ ఓరామా ! నీ మహిమ నేమని వర్ణింతును. నిశ్చల చిత్తముతో నొక్క తులసీదళ మర్పించినంతనే ఖేచర, కిన్నర, కింపురుషులలో వెలుగొందును. అట్టిచో నిరంతరమును నీ పాదముల నమ్మి పూజించువానికి మోక్షమబ్బుట యాశ్చర్యమా !

భానుడు తూర్పునందు గనుపట్టిన పావక చంద్రతేజముల్
హీనతజెందినటు జగదేక విరాజితమైన నీ పద
ధ్యానముచేయుచున్న బరదైవమరీచు లడంగ కుండునే
దానవగర్వ నిర్దళన దాశరథీ కరుణాపయోనిధీ ! 86

భా॥ ఓరామా ! సూర్యతేజస్సు ముందు చంద్రకాంతి వెలుంగునా ! నీ పాదదర్శనముచే లభించిన పూర్ణతేజస్సు

ముందర యీ ప్రకృతి నశించుట యెంత! కావున సచ్చిదానంద రూపమగు నీ యఖండతేజస్సున ప్రకృతి రూపియగు నా మనంబు లీనమయి స్థిరముగా నుండునట్లు నన్ననుగ్రహించితివి. నీ దయవలన కలిగిన నా యదృష్టమేమందును?

87—89 అవతారిక :—ఇట్లు తనకు లభించిన యీ రూఢ రామనామమే కారణమని దాని యావశ్యకతను మహిమను వర్ణించుచున్నాడు.

నీ మహనీయతత్వరస నిర్ణయ బోధకనామృతాబ్ధిలో
దాము న్రుంకు లొందక వృథాతను కష్టముజెంది మానవుం
డీ మహిలోక తీర్థములనెల్ల మునింగిన దుర్వికారహృ
త్తామసపంక ముల్వీడునె దాశరథీ కరుణాపయోనిధీ! 87

భా॥ ఓరామా! అహంకార మమకారముల నశింపజేయు నీ నామమహిమామృతము ననుభవింపక కేవల శరీరకష్టములతో గూడిన తీర్థయాత్రలను సేవించుటవలన మలత్రయములు నశించునా?

కాంచనవస్తు సంకలితకల్మష మగ్నిపుటంబు పెట్టి వా
రించినరీతి నాత్మనిగుడించిన దుష్కర దుర్మలత్రయం
బంచితభక్తియోగ దహనార్చి దగుల్పక పాయునే కన
త్కాంచన కుండలాభరణ! దాశరథీ కరుణాపయోనిధీ! 88

భా॥ ఓరామా! వస్తువులుగా చేయబడు కాంచనమేరీతి నగ్నిపుటంబుగాక శుద్ధముగాసరీతిని కర్మవాసనలచే జన్మమందిన వాసనలు నిరంతర నీ నామస్మరణచే దహింపబడి అంతర్ముఖమొనర్పబడిన యాత్మగాక వాసనాత్రయములు నశింపవు.

నీ సతి పెక్కు కల్మలిడ నేర్పరి. లోకమకల్మషంబుగా
నీసుత సేయు పావనము. నిర్మితకార్య ధురీణదక్షుడై
నీసుతుడిచ్చు నాయువులు. నిన్ను భజించిన గల్గకుండునే
దాసులకీప్సితార్థములు దాశరథీ కరుణాపయోనిధీ! 89

భా॥ ఓరామా! నీ భార్యయగు సీత నిన్నావరించి యుండు మూలప్రకృతి. సృష్టియంతయు నామెచేతనే కల్పింపబడినది. నీ పాదములయందు బుట్టిన గంగ అనగా మూలతేజస్సు నకును మూలప్రకృతికిని మధ్యనుండు చిత్స్వరూపము భక్తుల పరమపావనమును చేయుచున్నది. నీ కుమారుడగు తారకమను బ్రహ్మ పూర్ణాయువు నొసంగి జన్మరాహిత్యము నొసంగు చున్నాడు. ఇక నిన్ను సేవించిన వారికి నెరవేరని కోరిక లేముండును.

90 అవతారిక :—సాధకునకు మూలతేజస్సు ఎప్పుడు లభించి స్థిరమగునో అప్పుడే ఆ రూఢ భక్తుడగుచున్నాడు. ఆరూఢభక్తుని స్థితిని నడతను ఇందు నిరూపించుచున్నాడు. ఇట్టి స్థితిని పొందినవాడే ఆరూఢయోగి.

వారిజపత్రమందిడిన వారివిధంబున వర్తనీయపం
దారయ రొంపిలోన దమవంటని కుమ్మరిపుర్వురీతి సం
సారమున న్మెలంగుచు విచారగుడై పరమొందుగాదె స
త్కారమెరింగి మానవుడు దాశరథీ కరుణాపయోనిధీ! 90

91—100 అవతారిక :—కొందరు నీతిశమాదుల విడిచి ఘోరమైన తపస్సునకు తయారు పడెదరు. ఇదియే రాజ

సత్వము. ఏయోగముగాని వృత్తి సరియయినదిగాక తరింప చేయజాలదు. కావున మానవుడు ముందుగా తనవృత్తిని నిష్కళంకమైనదిగా చేసికొనవలెను. అనుభవనీయుడగు గురుడు ముందుగా సాధకునకు ఉపదేశింపవలసినదియును సాధకుని పరీక్షింప వలసినదియును ఈనీతి వర్తనమే. సాధకుడు ముందుగా సరిచేసికొనవలసినది ఇదియే.

ఎక్కడి తల్లి. దండ్రి. సుతులెక్కడివారు. కళత్రబాంధవం
బెక్కడ. జీవుడెట్టి తనువెత్తిన బుట్టుచు బోవుచున్నవా
డొక్కడె. పాపపుణ్య ఫలమొందిన నొక్కడె. కానరాడు వే
రొక్కడు; వెంటనుంటి. భవమొల్లనయా. కృపజూడుమయ్య! నీ
టక్కరి మాయలందిడక; దాశరథీ! కరుణాపయోనిధీ! 91

భా॥ ఓరామా! ఈ తల్లిదండ్రులు, భార్యాబిడ్డలందరును ఋణానుబంధముచే వారివారి కర్మఫలముల బొందవచ్చినవారు. కాని యొకరి నొకరు తరింపజేయువారుకారు. ఎవరిమట్టుకు వారు తమ కార్యములు నెరవేరిన వెంటనే చెప్పకనే విడచి పోయెదరు. ఒకరివెంట నొకరు రారుకదా. కావున ఓరామా! ఇట్లు ఋణానుబంధముచే కలుగు జన్మపరంపరలు కలుగకుండ నన్ననుగ్రహింపుము.

దొరసినకాయము ల్మిడిమిడోచిన జూచి ప్రభుత్వము ల్సిరు
ల్మెరుపులుగాగ జూచి మరి మేదినిలో దమతోడివారు ముం
దరుగుట జూచి తగునాయువెరుంగక మోహపాశము
ల్దరుగనివారి కేమిగతి దాశరథీ! కరుణాపయోనిధీ! 92

భా॥ ఓరామా! యీశరీరము జరామరణములతోఁ గూడినది. సంపదలు మెరుపులవంటివి. దినదినమును నాయువు క్షీణించుట యెరికని తప్పదుకదా. ఇట్లు కండ్లార జూచుచు వీటి యెడ మోహమును వీడని వారిగతి జన్మపరంపరల నొందు టయే కదా. కావున నన్నిట్టి ప్రకృతిమోహములోఁ బడనీయక కాపాడుము.

సిరిగలనాడు. మైమరచి చిక్కిననాడు దలంచి పుణ్యముల్
బొరిపొరి జేయనైతినని పొక్కిన గల్గునె గాలిచిచ్చుపై
గెరలినవేళ దప్పిగొని గీడ్పడువేళ. జలంబుకోరి త
త్తరమున ద్రవ్వినం గలదె దాశరథీ! కరుణాపయోనిధీ! 93

భా॥ ఓమూఢమనసా! నాశరీరమున వీర్యబలమున్నంత వరకు మైమరచి సంచరించి, పిమ్మట విచారించిన నేమిలాభము? కావున నిప్పుడే శ్రీరాముని పాదధ్యానమున తీవ్రముగా దగిలి తరించుము.

జీవనమింక బంకమున జిక్కిన మీను చలింపకెంతయున్
దావున నిల్చు: జీవనమె తద్దయు గోరువిధంబు చొప్పడన్
దావలమైనగాని గురితప్పనివాడు దహించువాడయా
తావక భక్తియోగమున దాశరథీ! కరుణాపయోనిధీ! 94

భా॥ ఓమనసా! భక్తియోగ మెట్టిదందువా, చెరువు లోని నీరంతయు నెండి యొకచోటగల బురదలోఁ జిక్కి తన కాధారమగు నీటియందే తదేకధ్యానము గలిగి యుండు చేప వలె ప్రకృతి సంబంధమగు బాహ్యప్రపంచమునందు దృష్టిని

విడిచి యాత్మ ప్రతిబింబితుడగు జీవతేజస్సునందే తదేకధ్యాన మును కలిగి జీవబ్రహ్మైక్యమును గలిగి యుండుటయే పరమా వధి. భగవంతుని కృపచే నిదియే భక్తుడు యోగియగు అవస్థ.

సరసుని మానసంబును రసజ్ఞు డెరుంగును ముష్కరాధముం
డెరిగి గ్రహించువాడె ? కొలనేకనివాసముగాగ దర్దురం
బరయగ నేర్చు నెట్లు వికచాబ్జమరందరసైక సౌరభో
త్కరము మిళిందమొందుక్రియ ? దాశరథీ ! కరుణాపయోనిధీ ! 95

భా॥ పువ్వుయందలి మకరందమును తుమ్మెద గ్రహించి పువ్వును పోషించుచు తాను లాభమును పొందుచున్నది. చీడ పురుగట్లు గాక తనలాభమునకై కొరికి తినివేయుచున్నది. స్వార్థపరుడగు మనుజుడు, సత్యాన్వేషణుడై నిరంతర భగవ ద్ధ్యానమునుజేయు భక్తుని హృదయమును దెలిసికొనజాలక వాని కార్యమునకు అంతరాయము గలిగించి పాడుచేయ చూచుచుండును. అట్టివాని పొందు కలుగకుండ నన్ను కాపాడుము.

పోచిన తల్లిదండ్రికి తనూభవు డొక్కడె చాలు మేటిఁ జే
చాచనివాడు. వేరొకడు చాచిన లేదనకిచ్చువాడు. నో
రాచి నిజంబెకాని పలుకాడనివాడు. రణంబులోన మై
దాచనివాడు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ !

భా॥ ఓమనసా ! ఒకరికిచ్చుటలో నహంకారమును ఒక రిని దేహీయని యడుగుటలో మమకారలోభత్వమును, కష్టనష్ట ములు సంభవించుచున్నను దేహాభిమానములు వీడి సత్యమును

దప్పకుండుటయును, ప్రకృతి తన్నులోబరచుచుండగా నందలిసుఖములకు లోబడని పురుషుడే భక్తియోగమును చేపట్టనర్హుడు.

"శ్రీయుత జానకీరమణ చిన్మయరూప రమేశ రామనా
రాయణ పాహిపాహి" యని బ్రస్తుతిజేసితి నామనంబునన్
బాయక కిల్మిషవ్రజవిపాటన మొందగజేసి సత్కళా
దాయఫలంబు నాకియవె దాశరథీ! కరుణాపయోనిధీ! 97

భా॥ ఓరామా! ఆదిమధ్యాంతరహితా! అఖండసచ్చిదానందవిగ్రహా! అక్షరత్రామణీ! నీ పాదదర్శనముచే నన్ను కళంకరహితునిగా జేసి నీసచ్చిదానంద రూపమును నా హృదయసీమను వికసింపజేసి నన్ననుగ్రహించితివి.

ఎంతటిపుణ్యమొ శబరి యెంగిలి కొంటివి! వింతగాదె!
మంతనమెట్టిదో యుడుత మైనిగరాగ్రనఖాంకురంబులన్
సంతసమందజేసితివి! సత్కులజన్మము లేమిలెక్క! వే
దాంతము కాదె నీమహిమ దాశరథీ! కరుణాపయోనిధీ! 98

భా॥ ఓమనసా! రాముడు సర్వభూతసముడు. భక్తుల పాలించుటే పనిగలవాడు. జాతిమతభేదములతో సంబంధము లేనివాడు. కావున నీవు భేదభావమును విడచి రాముని భక్తుల ననుసరింపుము.

బొంకనివాడె యోగ్యు. డరిబృందములెత్తినచోట జిహ్వకున్
జంకనివాడె జోదు. రభసంబున నర్థికరంబు సాచినన్
గొంకనివాడె దాత. మముగొల్చి భజించినవాడెపో నిరా
తంకమనస్కు, డెన్నగను దాశరథీ! కరుణాపయోనిధీ! 99

భా॥ ఓమనసా! నీకు శ్రీరామపాదదర్శనము కావలయునను కోరిక యున్నయెడల హరిశ్చంద్రునివలె యెట్టి ప్రాణమాన

ధనములకు కీడు కలిగినను సత్యమును వీడకుము. నీకెవరెట్టి కీడును కలిగించినను వారి కెదురు తిరుగక యాభారమును రాముని మీఁదనే యుంచుము. ఫలనన సత్యమగు బ్రహ్మపదార్థ మును సత్యమే తెలిసికొనగలదు. అట్టి దృఢత్వము నీకెన్నఁడు కలుగునో అప్పుడే నీకు రాముని పాదదర్శనమును పూర్ణదర్శన మును లభించును.

భ్రమరము కీటకంబుగొని పాల్పడి ఝూంకరణోపకారియై
భ్రమరముగా దనర్చునని బల్కుట జేసి భవాది దుఃఖసం
తమస మెడలించి భక్తిజనితంబుగ జీవుని విశ్వరూపత
త్వమున భజించె వేమరును దాశరథీ కరుణాపయోనిధీ ! 100

భా॥ ఓ మనసా ! తుమ్మెదయొక్క ఝూంకారముచే భయమంది నిరంతర మా తుమ్మెదనే దృష్టిలోగల చీఁవురుగే రీతిని కొంత కాలమున కా తుమ్మెద రూపమునే పొందుచున్నదో ఆ రీతినే నీవును నిరంతర రామపదధ్యానపరుండవైన నా రాముని సారూప్యమునే పొందగలవు.

101—102 అవతారిక:—సాధకుడు శ్రీరాముని కృపచే తనకు లభించిన పరమపదస్థానమున కానందమును ప్రకటించు చున్నాడు.

తరువులుపూచి కాయలగు తంతు సుమంబులు పూజగా భవ
చ్చరణమునోకి దాసులకు సారములై ధనధాన్యరాసులై
కరిభటఘోటకాంబర నికాయములై విరజానదీసము
త్తరణ మొనర్చు చిత్రమిది దాశరథీ కరుణాపయోనిధీ ! 101

భా॥ ఓమనసా! పుష్పములు పూచి చెట్టును విడువ

కొండిన కాయలుగానే మారును. ఆ పుష్పములే శ్రీరాముని పాదములపై నుంచబడిన దాసులకు సకలైశ్వర్యములును కలిగించును. అలాగుననే ప్రకృతిలో జన్మించిన మానవుడా ప్రకృతి యందలి మోహముచే దానిని విడువకొండిన అశాశ్వతములగు ప్రకృతి సుఖములనే పొందగలడు. అట్లుగాక ప్రకృతిని విడిచి నీ యందే తన మనంబును తదేకనిష్ఠతో నుంచిన శాశ్వతమగు నీ సాయుజ్యమును పొందుచున్నాడు.

పట్టితి భట్టరార్య గురుపాదము, లిమ్మెయి నూర్ధ్వపుండ్రమున్
బెట్టితి మంత్రరాజమొడి బెట్టితి, నయ్యమకింకరాళికిన్,
గట్టితి బొమ్మ, మీ చరణకంజములందు తలంపు బెట్టి పో
దట్టితి పాపపుంజముల దాశరథీ కరుణాపయోనిధీ ! 102

భా॥ ఓరామా ! బాల్యమున తల్లిచే నీకథామృతమును చెవులార గ్రోలినవాడనయి యీ సంసారమునుండి తరింపబడు మార్గము వేరెలేదని నీవే దైవము గురుడవు నను భావముతో పెద్దల సేవలచే లభించిన ధర్మముల ననుసరించుచు ప్రకృతి బద్ధుడనై కామాదులైన మొసళ్ళచే నధోగతికి లాగబడుచు పైకి తేలుచు చర్వితచర్వణముగా నుండ నీ కృపచే శాంతస్వభావులును గృహస్థాశ్రమమున నుండి గీతయందలి యోగసాంప్రదాయిక సిద్ధులునునైన శ్రీ పట్టిసపు సూర్యనారాయణరావుజీ గారు మార్గదర్శకులగు నదృష్టము నాకు లభించినది. ఎన్నటికైనను నీలో చేరగలనను దృఢమగు నమ్మకమునకు నీ కృపయు నా మహానుభావుని మార్గదర్శకత్వమును లభించుటయే కార

ణాము. నీవుమాత్రము నీకుగల బిరుదుల మరువకుము. సత్యమును తప్పకుము.

103 అవతారిక :— ఇందలి గ్రంథకర్తయొక్క సంబంధాది విషయముల దీనికి విమర్శనను వ్రాసిన సేవకుడు తనపై యారోపించుకొని వ్రాయబడినది.

అల్లనలింగమంత్రి సుతుడత్రిజ గోత్రజుడాది శాఖకం
చెల్లకులోద్భవుండన ప్రసిద్ధుడనై భవదంకితంబుగా
నెల్లకవుల్నుతింప రచియించితి గోపకవీంద్రుడన్ జగ
ద్వల్లభ నీకు దాసుడను దాశరథీ కరుణాపయోనిధీ! 103

భా॥ ఇది శ్రీదయాసత్యశౌచముల గలిగి నిరంతర రామపదభక్తులైన వేదుల వేంకటశాస్త్రి రామమ్మగారలకు ఐదవ పుత్రుండును అమరకోశమునైనను జదువక కేవల శ్రీరాముని కృపచే పెద్దల యాశీర్వచనమున లభించిన స్వల్పజ్ఞానముచే 1 సంధ్యావందనవిధి, 2 సుఖజీవనము, 3 భగవద్గీత యోగమార్గము, 4 హిందూవిజ్ఞానము, 5 సుమతీశతక ధర్మసూక్ష్మమును, 6 ఆత్మబోధ, 7 పురాణములు అంతరార్థములు, 8 యుగపురుషుడు, కాలాచార్యులు అను గ్రంథములను లోకమును లక్ష్యముగా నుంచుకొని లోకుల క్షేమము, తన క్షేమమును కోరి రచించిన వేదుల పార్వతీశముచే వ్రాయబడినది.

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం
సర్వమంగళ మాంగళ్యేశివే సర్వార్థసాధకే
శరణ్యేత్రియంబకే దేవి నారాయణి నమోస్తుతే.

| తప్పు. | ఒప్పు | |
|---|---|---|
| భుయో. భుయో | భూయోభూయో | ముఖపత్రం |
| డిటో | డిటో | రెండవముఖపత్రం |
| శబలతో | శబలతతో | అవతారిక 1 పే. 10 పంక్తి |
| గ్రంధములో | గ్రంధములలో | డిటో 1 పే. 22 పంక్తి |
| వితరణ | వివరణ | డిటో 3 పే. 6 పంక్తి |
| కౌసలాదులు | కౌసల్యాదులు | డిటో 5 పే. 10 పంక్తి |
| — | గని | విజ్ఞాపన 2 పే. 12 పం. |
| జదివి | జదివినను | డిటో 13 పం. |
| జ్ఞాదేవు | జ్ఞానదేవు | 3 పే. 12 పం. |
| లకు | లగు | 7 పే. 20 పం. |
| సవినీయము | సవినయము | 12 పే. 11 పం. |
| శ్లోకముచే | శ్లోకములచే | 15 19 పం. |
| బోధించి | బోధించిన | 15 19 పం. |
| శ్రీకృష్ణుని | శ్రీమహావిష్ణుని | 15 6 పం. |
| తను | (అవుసరములేదు) | 9 పం. |
| వర్యుమత్ | నమామ్యహమ్ | 21 పం. |
| విజ్ఞాన | సుజ్ఞాన | 19 5 పం. |
| విజ్ఞాన | సుజ్ఞాన | 20 1 పం. |
| విజ్ఞాన | సుజ్ఞాన | .. 5 పం. |
| సహస్కారము | సహస్రారము | 21 5 పం. |
| ప్రకృతి | ప్రకృతిని | .. 17 పం. |
| రహితముగా | రహితకాగా | 22 . 3 పం. |
| తాండవ | తాండవ శివ | 23 9 పం. |
| ఆస్తికుడయి | ఆస్తికులయి | 1 పేజీ 6 పం. |
| తవ | తమ | .. 7 పం. |
| అశాశ్వతమగు | అశాశ్వతమగు | 5 పేజీ 1 పం. |
| దండలుకాక | దండలుకాగ | 6 పేజీ 17 పం. |
| రోటి | రోటు | 7 పేజీ 6 పం. |
| పరతత్వ | పరతత్వ | 7 పేజీ 22 పం. |

| తప్పు | ఒప్పు | |
|---|---|---|
| గుద్దలిచ్చే | గుద్దలిచే | 11 పేజీ 21 పం. |
| రూపాము | రూపము | 14 12 పం. |
| తల | తన | 17 12 పం. |
| డింక | డా త్రి | 19 4 పం. |
| విజ్ఞాన | సుజ్ఞాన | 19 12 పం. |
| కవిత | కలిత | 20 7 పం. |
| వికుంద | వికుంఠ | 24 2 పం. |
| వెజ్జుపై | వెజ్జపై | 25 6 పం. |
| లేక వత్సలతో | లేక భక్తవత్సలత | 26 18 పం. |
| విజ్ఞాన | సుజ్ఞాన | 27 21 పం. |
| పరాహతి | పదాహతి | 29 12 పం. |
| రూప | రూపి | .. 15 పం. |
| ఆదరించి | ఆవరించి | 26 6 పం. |
| యోక్ష | మోక్ష | .. 12 పం. |
| ముక్కు | నుక్కు | 41 5 పం. |
| నశింపుగాక | నశింపక | 45 21 పం. |
| దర్పర | దత్పర | 47 11 పం. |
| వా శరీరము | నీ శరీరమున | 51 11 పం. |

మనవి:- ఎవరైనను ఉదారస్వభావులు, దైవభక్తులు ఈ గ్రంథమును అచ్చొత్తించి భక్తుల కందజేయ తలంపుగలిగిన వారీ గ్రంథమును వీలైనన్ని ప్రతుల నచ్చొత్తించుకొనవచ్చును. వివరములకు ముందుగా వ్రాసిన అనుమతి ఈయబడును.

గ్రంథకర్త :

వేదుల పార్వతీశం

వ్యవస్థాపకుడు,

హిందూ విజ్ఞాన ప్రబోధ గ్రంథమాల.